# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 16-12-1980 | సంచిక 4


—* ఈ సంచికలో *—





1—1 81 సంచికలో గాథాసప్తశతి - ఋతువర్ణనలు, పానుగంటివారి రాధాకృష్ణ-భక్తిరసం, కాళిదాసుని నా
కల్పనలు, దాశరథి పునర్నవం, ఉపనిషత్తులు - భక్తి మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధ సంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-12-1980 సంచిక 4


## తెలుగు ఎలిజీ స్వరూపము


– శ్రీ సాంబయ్య పరిమి, ఎం ఏ


ఎలిజీ - విషాదాన్ని వ్యక్తపరిచే ఆధునిక సాహితీప్రక్రియ ఇది భారతీయ సంప్రదాయబద్ధం గాదు గ్రీకులనుండి ఆంగ్లేయుల ద్వారా తెలుగులోకి వచ్చింది తెలుగులో ఈ ప్రక్రియపై జరిగిన పరిశోధన స్వల్పము. Dr C నారాయణ రెడ్డి ఆధునికాంధ్ర సాహిత్యమున స్థాలీపులాకన్యాయంగా, శ్రీ ప్రణతుల రామచంద్రయ్య సాహితీసమితి వ్యాసావళిలో స్థూలంగా, పరామర్శించారు 1979 అక్టోబరు 5-7వ తేదీలలో ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరులో జరిగిన ద్వితీయ ఆంధ్రప్రదేశ్, ఓరియంటల్ మహాసభలలో శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు (విజయనగరం) ప్రసంగించిన 'తొలి తెలుగు ఎలిజీలు' అనే వ్యాసం కేవలం డా. నారాయణరెడ్డి, శ్రీ ప్రణతుల వాదాలను పరాస్తం చేసేదిగా ఉంది ఈ మధ్య సమాలోచన 8 వ సంచిక 7 వసంపుటంలో శ్రీ యస్వీ సత్యనారాయణ 'శ్రీకృష్ణ నిర్యాణము-ఒక ఎలిజీ' అనే వ్యాసాన్ని వ్రాశారు ఇది సమగ్రమైంది కాదు వీరు శ్రీ పణతుల రామచంద్రయ్య వ్రాసిన వ్యాసాన్ని చూడకపోవటంచేత ఆ విధంగా వ్రాశారని భావింపవచ్చు

ఎలిజీ - పుట్టుపూర్వోత్తరాలను Encyclopedia of Britanica, History of English literature History of American literature The introduction to the study of the literature మొదలైన గ్రంథాలను పరిశీలించి గ్రహించవచ్చు

గ్రీకు సాహిత్యంలో అవతరించిన 'ఎలిజీ' అదే పేరుతో ఆంగ్లసాహిత్యంలోను అమెరికన్ సాహిత్యంలోను వ్యవహృతం అవుతుండగా, తెలుగులో 'ఎలిజీ'కి సమానార్థకమైన పదం లేదు అని బాధపడటం వ్యర్థంఅయినప్పటికి 'ఎలిజీ'ని తెలుగులో 'స్మృతికవిత' అని విమర్శకులు భావిస్తున్నారు

Elegy : A mournful poem, A sustained and formal 'Poem' setting forth the Poet's meditations upon death or upon grave, theme, occasioned often by the death of a particular Person, or in the alternative, it may be a generalised observation or the expression of a solemn mood such as Auden's 'In memory of W B Yeats' or Gray's 'Elegy written in a country churchyard ' In greek and Roman literature the term was applied to any poem using the elegiac couplet often on such subjects as love, and war, as well as death A specific sub type is the Pastoral elegy in which the poet and his subjects are spoken of as shepherds or goatherds, and the setting is the classical pastoral world'— అని ఎలిజీని 'A Dictionory of literary terms' వివరిస్తున్నది

ఆధునికాంధ్ర సాహిత్యంలో వెలసిన నూత్నప్రక్రియలన్నీ ప్రాచీన సాహిత్యంలో ఉన్నా యని తృప్తిపడటం తప్పు కాదు గాని, అనవసరం

'పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవ మి త్యవద్యం'

అని కాళిదా సన్నా మన విమర్శకులు ఆధునిక కవితావిలసిత ప్రక్రియలన్నీ పూర్వ కవిత్వంలో ఉన్నాయని భావిస్తున్నారు భావకవిత్వ - పోకడలు, అభ్యుదయ కవిత్వ -ఆవిర్భావం, విప్లవకవిత్వ విచారం పూర్వ కవిత్వాలంబనంగా విమర్శిస్తున్నారు

ఎలిజీకి 'స్మృతి కవిత' అని తెలుగులో అనువాదంచేసినా 'ఎలిజీ' అన్న పదాని

ఉన్న ప్రచారం 'స్మృతి కవిత' అన్న సమాసానికి లేదు ఎలిజీని శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు 'ఒక ప్రాణి మరణంపట్ల ఉద్విగ్నుడైన కవి తన హృదయాంతరంలో పరాకాష్ఠ నందిన బాధా తీవ్రతని తన రచనలో ఇమిడ్చి చూపిస్తే అది స్మృతిగీతం (Elegy) అవుతుంది' అని నిర్వచించారు. కాని తెలుగులో ఉన్న ఎలిజీని నిశితంగా పరిశీలించి ఇది 1) కరుణమయ కవిత 2) స్మృతికవిత 3 విమర్శనాత్మక ఎలజీ అని విభజించవచ్చు తెలుగులో ఉన్న ఎలిజీ స్వరూపాన్ని పరిశీలించటం ప్రస్తుతోద్దేశం

ఆనందం కలగడ, భయం పుట్టటం విచారం పొందడం అనేవి మానవసహజ గుణాలు. అంతేకాదు సమస్తజీవి నైజ ధర్మాలు సమస్త జాంతవ ధీపరిధి నధిగమించి అనంతాకాశ వీథుల్లో మానవ ప్రజ్ఞ, ఎఱకలుదువ్వి ఎగరేసిన విహంగంలాగా విహరిస్తూ వుండటంచేత, మనసులో కల్గిన ప్రతి అలజడిని, అలవోకగా, హృదయారంజకంగా వ్యక్తం చేసుకో గల్గుతున్నాడు మానవుడు ఉపరి కవి

మానవుడు తన హృదయస్పందనను వ్యక్తంచేసుకునే ప్రక్రియ కవిత్వం. శృంగార కరుణానందభీభత్సాది రసస్ఫోరక హృదయ స్పందనాజనిత కవితకన్నా ఆప్తబంధువుల ప్రియమిత్రుల వియోగం వల్ల కల్గిన కవిత, వేదనాభరితమై, ఆవేశపూరితమై హృదయసాగరకల్లోల తరంగాంతరంగ ఘోషాసదృశమై ఉప్పొంగి, శోకమయ సీమంతినియై కళ్ళకు కనబడుతుంది ఇటువంటి కవితకు ఆత్మాశ్రయత ప్రాణప్రదమైంది ఆత్మాశ్రయత్వము భావకవిత్వానికీ ప్రధానలక్షణము ఈ కరుణమయ కవిత' (Elegy) భావకవిత్వంలో భాగ మని విమర్శకుల భావన

'మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని కావ్యాని' అన్న సంప్రదాయానికి బద్ధులై తెలుగుకవులుకూడ కావ్యరచన కావించడంతో విషాదమయ రచనకు మన సాహిత్యంలో ప్రధానస్థానం లేకుండా పోయింది

కవులకావ్యాలు మంగళ ప్రదాలే అయినా జీవితంలో విషాదం కల్గక మానదు విషాద వేదన మనిషి మనసును కలచివేస్తుంది అసలే కవి, ఆ పైనివిషాదియైన వానికి ఆ ఆవేదన కవితారూపంలో వెల్వడటం సహజం ఈవిధంగా కవిజీవిత విషాదపు పుటలనుండి అవతరించిన ఆవేదనాజనిత, ఆవేశభరిత భావ పరంపరే 'కరుణమయ కవిత' పూర్వకవి జీవితపు పుటలనుండి లభించిన ఇట్టి కవితలు వేళ్ళపై లెక్కపెట్టగలిగినవే కాని ఎక్కువ లేవు

శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యుల 'తొలి తెలుగు ఎలిజీలు' అన్న వ్యాసం ఆధారంగా - మనకు 12వ శతాబ్దంలో తిక్కన హరిహరనాథ సాయుజ్యం పొందినపుడు ఒక తెలుగుకవి రాసిన 'నందిని బుత్తెంచె సొచ్చి చనియె'అనే సీసపద్యం మొదటి స్మృతిగీతం ఖడ్గ తిక్కన మరణంతో ఉద్విగ్నుడైన ఒక చాటుకవి 'చిక్కక మన్మసిద్ధి సాక్షిగన్' అనే స్మృతిపద్యంలో తన ఆవేదనను సుస్పష్టంచేశాడు రాయని భాస్కరుడు అస్తమించగా ఓ కవి వ్రాసిన 'సహజ కళంకమూర్తులు . అస్తమించగన్' అన్న పద్యమూ, సుప్రసిద్ధాంగ ఎలిజీగ పేరుపొందిన 'Rugby chapel' లోని కొన్ని స్టాంజాలు, నెహ్రూపై తిలక్ వ్రాసిన కొన్ని పాదాలు ఒక్కలా వున్నాయి - అన్న విషయాలు తెలుస్తున్నాయి ఈ వ్యాసం రాకపూర్వం -

'కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయ డిచ్చుఁ
గైలాసగిరిబండె మైలారు విభుఁ డేఁగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు
రంభఁ గూడెఁ దెలుంగురాయ
రాహుత్తుండు
కస్తూరి కేరాజు ప్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు
భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్ట మనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి'

అన్న శ్రీనాథుని చిట్టచివరి పద్యంపై 'విస్తృత పరిధిలో ఎలిజీ అవుతుంది కాని ఆధునికదృష్ట్యా కాదు ' అని శ్రీప్రణతుల వారి సిద్ధాంతం ఉంది కాని విలియం హెన్రీ హడ్సన్ An troduction to the study of literature లో — 'It has grown into a memorial or encomiastic poem, containing the poet's tribute to some great man (not necessarily relative or personal friend), and often study of his life, and character, with reminiscences and thoughts suggested by them' — (Page 100) అని ఎలిజీ స్వరూపాన్ని వివరించారు. ఈ ఆధునిక విమర్శన ఆధారంగా - శ్రీనాథుడు ఆత్మీయుల ఎడబాటుకు ఎంతగా పరితపించాడో నిరూపించే ముంజేతి కంకణంవంటి, పై పద్యంకూడ ఎలిజీయే వాళ్ళ ఉనికి లేక తన ఊపిరి నిల్వదని, వాళ్ళు మసగడలేక తన ప్రాణం మనలేదని, ఆవేదనపడి, బ్రతకలేక 'కలియుగంబున నిఁకనుండ కష్టమనుచు అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి' అని ప్రాణాన్ని వదిలేడు. ఇది ఆత్మాశ్రయ వేదన అటువంటి ఈపద్యం గురించి 'విస్తృతపరిధిలో ఎలిజీ అవుతుంది గాని ఆధునిక దృష్ట్యా కాదు' అన్న వాక్యం పునఃపరిశీలనయోగ్యమనిపిస్తున్నది

అల్లసాని పెద్దనకు శ్రీకృష్ణదేవరాయల మరణంపట్ల కల్గిన ఆవేదన -

'ఎదురైనచో తన మదకరీంద్రము నిల్పి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రంబందుకొనువేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేల పట్టి యెత్తె
బిరుదైన గండపెండెరమునకును నీవె
తగుదని నాదుపాదమున దొడిగెఁ
గోకట గ్రామాద్య నేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితా పితామహ యల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
వసుధ బ్రతికితి జీవచ్ఛవంబ నగుచు'

అనే పద్యరూపం తాల్చింది ఈ పద్యాన్ని చెప్పటానికి పెద్దన తను కోరినట్లు 'నిరుపహతి స్థలము' గాని రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురపు విడెముగాని, 'ఆత్మ కింపైన భోజనము' గాని 'ఊయల మంచము' గానీ, ఒప్పు తప్పరయు రసజ్ఞులు గాని ఊహ తెలియంగల లేక పాఠకోత్తములు' గాని లేరు కాని వీనికి మించిన హృదయ వేదన ఉంది ఆ వేదననుండి జనించేద ఈ కవిత. ఇదే కరుణామయ కవిత.

ఆంగ్లంలో ఉన్న ఎలిజీని 'స్మృతి కవిత' అని అంటున్నారు. ఆంగ్ల భాషా సాహిత్య సంపర్కంతో, వ్యక్తిమరణం పట్ల సంతాప సూచకంగా వెల్వడిన విషాదకవితల్ని 'స్మృతికవిత' అని, ఆంగ్ల భాషాసాహిత్య సంపర్కం లేకుండానే, ప్రాచీనాంధ్ర సాహిత్యంలో స్వాభావికంగా వెలసిన, ఆత్మాశ్రయ, విషాద సూచక కవితలను 'కరుణమయ కవిత'అని పేరు చేస్తున్నాను (కాళిదాసు కుమారసంభవమునగల రతి విలాపము, శ్రీనాథుని కాశీఖండంలో, అగస్త్య కాశీ విరహం, పోతన భాగవతంలోని కృష్ణ నిర్యాణ ఘట్టం మొదలైన వాటిని కరుణమయ కవితలుగాకాని, స్మృతికవితలుగా కాని తీసుకోరాదు వీటిల్లో ఆత్మాశ్రయత్వం వ్యాగ్యం )

గ్రీకుసాహిత్య ప్రక్రియ అయిన ఈ 'ఎలిజీ' 16వ శతాబ్దంలో ఆంగ్లంలోను, 19 శతాబ్ది పూర్వార్ధంలో అమెరికాలోను 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో తెలుగులోను ఆవిర్భవించింది. ఎలిజాయిక్ ఛందంలో వ్రాసిన కవితనే గ్రీకు భాషలో ఎలిజీ అనేవారు క్రీ పూ 15వ శతాబ్దింలో Propertius sextus' అనే రోమన్ కవి వ్రాసిన ఎలజీలోగల -

— U U— U U—
'Non faciet Capiti
UU — U U -
duracoro nameo
— — — U U—
E xactus tenlli
— U U — U U—
Pumice Versus cat
— U U — — ---
quove ped (e) in gressi
— U U— U U —
qwamve bibistis a qwam
— — - - — —
In vestrum quaeso
— UU -U U—
me sinite (e) ire nemus'
Encyclopedia of Britanica
8 vol 267 page

ఈ ఛందస్సునే (Metre) ఎలిజాయిక్ మీటర్ అంటారు ఈకాలంలో వీళ్ళకు ఛందో నిర్దేశ కవిత్వమే కాని వస్తునిర్దేశకవిత్వం లేదు.

కాలక్రమంలో ఆంగ్ల సాహిత్యంలో పై ఛందోనియమాన్ని పాటించని, కేవలం మనోవేదనను సూచించే కవితల్ని ఎలిజీ అన్నారు

'From the 16 th century in England the word Elegy has been used to mean a poem or song in lamentation of death' అని ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ బ్రిటానికా నిర్వచించింది

దేశనాయకుల మహాపురుషుల, ఆప్తమిత్రుల మరణంవల్ల కల్గిన ఆవేదనావ్యక్తీకరణసాధనంగా ఉన్న ఎలిజీ, మరికొంత కాలానికి Pastoral Elegy గా పరిణామం చెందింది

'A poem expressing grief at the loss of friend or important person employing conventional Pastoral elegy, and written in a dignified and serious language (A Dictionary of Literary terms) Page 151

అని Pastoral elegy కి వివరణ

ఆంగ్ల సాహిత్యంలో గల ప్రముఖ కవుల ఎలిజీలను పరిశీలిస్తే, ఎలిజీ ఒక వ్యక్తి మరణంపట్ల గాఢసంతాపసూచక కవిత అని తెలుస్తుంది అంతేకాదు. కవికి మరణించిన వ్యక్తికి సన్నిహిత సంబంధం ఉండాలని, కవి, మరణించిన వ్యక్తి ఒకే కాలానికి చెందినవారై ఉండాలని తెలుస్తుంది ఉదాహరణకు ఎప్పుడో మరణించిన శ్రీనాథుని గురించి ఇవ్వాళ నేను విలపిస్తూ రాసిన ఎలిజీ అనరాదు ఎందుకంటె అందులో శ్రీనాథునిపై నాకు అభిమానంలే దని కాదు ఆవిధంగా రాసినకవితలోని భావావేశంలో నిజం పాలుకన్న ఊహాభాగం అధికం

'Its basis is manifestly, therefore, absolute sincerity of emotion and expression, since the slightest hint of simulation or artifice ' (Page 100)

An introduction to the study f Literature లో హడ్సన్ వివరించి ట్లు ఎలిజీ కవిత నిజమైన అనుభూతి ుండి ఆవేదననుండి జన్మించిందే కాని, లోచననుండి పుట్టిందికాదు వాస్తవ ్రతణకు సమీపవర్తియేకాని,ఉత్ప్రేక్షా లసితం కాదు హడ్సన్ ఇంకా -

'More over under the powerul influences of a bookish age, he elegy in modern literature as often beem used as a vehile for literary criticism'

అనికూడా వివరించారు ఆధునిక ఎల ి, సాహిత్య విమర్శకు కూడ సాధ ంగా వాడుకోవచ్చు అని పై వాక్యాల ల్ల తెలుస్తున్నది సాహిత్యవిమర్శకు ాధనంగాఉన్న ఎలిజీ కవితను 'విమర్శ ాత్మక ఎలిజీ' అనవచ్చు ఈ విమర్శ ాత్మక ఎలిజీకి మచ్చుతునక కందుకూరి ్రేశలింగం పంతులుగారు వ్రాసిన 'సర స్వతీ నారద విలాపము' ఇందులో కవి ాటి సాహిత్యస్థితికి సరస్వతి విలపిస్తు ున్నట్లు విమర్శించారు ఇది ఆంధ్ర సాహి త్యంలోగల సమగ్రవిమర్శనాత్మక ఎలిజీ

పూర్వకవులు తమ తమ కావ్యారం భాల్లో చేసిన కుకవినిందాత్మక పద్యాలు కూడ ఈకోవకు చెందినవేకాని, అందులో ి కవులకు కుకవులపైగల నిరసన భావం ్నిపిస్తుందే తప్ప ఆ నాటిసాహిత్య స్థితికి వారి ఆవేదన వ్యక్తం కావటం లేదు

ప్రస్తుతం నేటి విమర్శకులు కవులు హడ్సన్ వాక్యాలను ప్రమాణంగా తీసు ొని, 'విమర్శ నాత్మక ఎలిజీ'లకు ఆదర ను మనుగడను కల్పిస్తే బాగుంటుంది

# కోడికూతలు కాలప్రమాణా లవుతాయా ?

- శ్రీ ననుమాస స్వామి , ఎం. ఏ.

కాలాన్ని తెలిపే యంత్రా లున్న ఈ రోజుల్లో గంటల్తో పనిగాని, జాములను లెక్కించే దెవరు? జాముకోళ్ళను అనుస రించే దెవరు? కాని పూర్వకాలంలో మన వాళ్ళు కోడికూత లాధారంగా కాలాన్ని గణించా రన్నది నిర్వివాదాంశం పల్లీయు లకు నేటికీ కోడి కూతలే కాలప్రమాణ మన్న అతిశయోక్తి కాదు

సామాన్య ప్రకృతి వర్ణనలు స్వభా వోక్తి రమణీయాలు కావ్యాలందున్న ప్రకృతి వర్ణనల్లో వేకువజామున కూస్తున్న కోళ్ళ వర్ణనలు ఎంతోరమ్యంగా ఉండి, ప్రకృష్టమైన రచనల్తో కూడి శోభాయ మానాలైనాయి ఈవర్ణనలు ఈ నాటివి కావు. కవితావతరణమే ప్రకృతివర్ణ నల్తో ప్రారంభమైం దని చెప్పొచ్చు ఈ వర్ణనలు ప్రాయికంగా అద్భుతావహ మైన దృష్టితో, జీవితావసరములకు కాల గతికి ఉండే సంబధాన్ని పురస్కరించు కొని మాత్రమే చేయబడినాయి

సర్వసాధారణంగా కోళ్ళు జాము కో సారి కూస్తాయి కోడి కూతలోని వర్ణాలు 'కొక్కొరోకో' అని హ్రస్వదీర్ఘప్లుత రూపాలైన స్వరాలు మూడును మూడు పురుషార్థాలను సూచిస్తున్నాయి 'కో' అంటే మేలుకో అని నిర్వచించిన కవు లున్నారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు తెల్లవారు జామున కోడి భూపాళరా గంతో తాళంకూడా 'కొక్కొ-రో-కో' అని పడుతుం దని వివరించారు ఏమయితే నేం ఆ ప్రామోస్త్రోతలు మేలుకొలుపు పాట లని అంగీకరించవల్సిందే ఎందు కంటే ఆకూతలు ఉపన్యస్తమునకు సంబంధించినవి మన పూర్వులు కోడి కూత లాధారంగానే ఎల్లదిక్కులకీ వెళ్ళి తమ పనులను నిర్వర్తించేవారు మునులు సైతం కోడికూతలయొక్క ఎలుంకే ఆధా రంగా తమ జపతపాల నారంభించేవారు. నేటికికూడా కోడికూతల ఆవశ్యకత తీర పోలేదు తొలికోడి కూసింది తెలతెల వారిం దని ఇంటియిల్లాలు ఇంటి పనుల లోనికి యజమానులు పొలం పనుల్లోకి, దూతిపోతారు తొలిరోజుల్లో కలికే మోజున్న ఆలుమగలకు ప్రణయకోపం చల్లారేందుకు తొలికోడికూతే ఆఖరి హెచ్చరిక. సహజసిద్ధమైన ప్రకృతి యొక్క పరిజ్ఞానం కోడి కుండబట్టే ఆ కోడి కూతల్నే కాలమానంగా పరి గణిస్తాం

శివకవులు, ప్రబంధకవులు ప్రకృతిలో దీన్ని మేటిగాను, స్వభావోక్తిరమ్యం గాను,చిత్రించారు ఈకవులు ఈదృశ్యా లను యథాతథంగా వర్ణించిన పట్టు లరు దుగా నున్నా వారు కల్పనా శిల్పాన్ని జోడించి కృత్రిమంగాప్రవేశపెట్టినఘట్టా లధికంగా నున్నాయి కవులు కొందరు కోడికూతలను వర్ణిస్తూ కూసిన విధా నాన్ని, వైశిష్ట్యాన్ని మాత్రమే పేర్కొ న్నారు కాని పాల్కురికి సోమన్న 'పం డితారాధ్య చరిత్ర'లో వేకువజామున కూస్తున్నకోడిని ప్రత్యక్షంగా వర్ణించిన విధానం ఎట్లుంటో చూడండి

"తొలికోడి గనువిచ్చి నిలచి మై వెంచి
జలజల ఱెక్కలు సడలించి నీల్గి
గ్రక్కున గళ మార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
నిక్కించి మెడసాచి నిక్కి మిన్నూచి
కొక్కొరో కుఱ్ఱు కూయకమున్న'

ప్రభాతసమయం సమీపిస్తున్నదని మేలుకొలుపేందుకు కోడిపడే పాటును కండ్లకు కట్టేలా రమణీయంగా వర్ణించాడు ఇంతటి స్వాభావిక చిత్రణం మన ప్రాచీన కావ్యాల్లోనే కాదు ప్రబంధాల్లో కూడా అరుదు

'మనుచరిత్ర'లో మన్మథుని దాడికి, చంద్రుని బారికి తట్టుకోలేక తాపం హెచ్చి వరూధిని మూర్ఛిల్లింది చెచ్చెలులు ఉపచారాలు చేసి తేర్చారు అంతలో తెల్లవారు వేళ కావచ్చిందట సూర్యోదయ సూచన చేసేందుకు కాబోలు

'సకలాశాగతి వర్మకోప విరతి
  ప్రాత క్రియారంభణా
త్మక వర్ణత్రయికిన్ మదుచ్చరిత శ
  బ్దజ్ఞానమే మూలమిం
తకు బోలన్ వినుడంచు దెల్పుగతి జెం
  తం గొండపై పల్లెలం
గృకవాకుల్మొరసెన్ గృహోపరి ద్రిభం
  గిన్ భుగ్నకంఠధ్వనిన్' (3-55)

ఈ మోతలో తెలతెలవారుతోంది లేవండిక లేవండో అని మాత్రమే కాదు ఇందులో కోడికూత ఘనతను పేర్కొన్నారు అది త్రికాలబోధకము, త్రిమునిసంభావ్యమని సూచిస్తుంది ఈ వర్ణనలో కోళ్ళు ఉన్నతస్థలాలను ఎక్కి త్రివర్గావశ్యకతని తెలియజేసే విధానం - ఏదేని పదిమంది ఆలకించాల్సిన అంశాన్ని చెప్పేవాడు ఎత్తున్న స్థలాన్నుండి చెప్పినట్లయితే చూస్తున్న, వినుచున్న వాళ్ళకు వీలున్నట్లుగా నుంది. ఇది కవి భావనాశక్తిని ప్రస్ఫుటింప జేస్తుంది

'శృంగార శాకుంతలం'లో శకుంతల దుష్యంతుని వియోగం ఓర్వలేకపోతుంది. తెల్లవారితే నే నెవరికీ జెలువను నావిభుడుంటాడు కాని భావజుని చేత ఈలోగా చావకుండా కాపాడండని చెలుల్ని వేడుతుందామె చెలులామెను రాత్రంతా ఉపలాలిస్తుండగా .

'తోయజ పుష్పబాంధవుడు
  తూరుపుకొండకు రాదలంచె భూ
నాయకుడు న్శకుంతల మ
  నం బలరన్ జనుదెంచు దుమ్మెద
ల్మ్రోయకుడీ శుకంబులు పె
  లుంగులు సేయకుడీ పికంబులుం
గూయకుడీ ప్రమాద మని
  కూకలు వేసిన భంగి గొక్కొరో
కోయని బిట్టుమ్రోసె దొలం
  కోడిని కుంజకుటీరవాటికన్' (3-199)

'ఎప్పుడొకో యీనిశి చను, నెప్పుడొకో తెల్లవారి హృదయేశు మొగం, బెప్పుడొకో చూచుట' అనే ఆత్రమున్న నాయికకు తెల్లవారబోతూందనే కోడికూత ఊరటను కలిగిస్తుంది-కవి ఈ వర్ణనలోని కోడికూతను రాజా వస్తున్నాడనే హెచ్చరిక వోలె మాత్రమే వర్ణించాడు

'వసుచరిత్ర'లో వియోగబాధను అనుభవిస్తున్న గిరికకు మంజువాణి రాజునుండి తెచ్చిన ఉంగరాన్నిస్తుంది అప్పుడది చంద్రాస్తమయ సమయం ఇక తెల్లారబోతుందని తొలిమారు తెల్పుటకు సంరంభించి

'ఒకనాడింద్రుని కుంత వేల్పు మదీ
  యోక్తిన్ విడంబించి తా
నొక కాలం బెతిగింపవచ్చి ముని శా
  పోద్వృత్తి పాలయ్యె మా
మక శబ్దంబిది యల్పమే త్రిముని సం
  భావ్య త్రికాలీవిబో
ధకమన్ రీతి ద్రిభంగిగా మొరసె జెం
  తం దామ్రచూడౌఘముల్' (4-126)

ప్రకృతిసిద్ధమైన సహజకాల పరిజ్ఞానం కోళ్ళకు ఉందనే ఘనత తెలిసి ఇంద్రునంతటివాడు కోడివలె కూసి శాపం పొందాడని, అల్పమయిందేమీ కాదని కోడి కూతయొక్క గొప్పతనాన్ని కవి రమణీయంగా వర్ణించాడు

ద్వ్యర్థి కావ్యం 'హరిశ్చంద్ర నలోపాఖ్యానం'లో సూర్యాస్తమ సమయం, నిశీధిని వర్ణించి వేకువజామున కూస్తున్న కోడి కూతలను వర్ణిస్తూ

'తరణిం దక్షిణయ ప్రతీక్షణ విని
  ద్ర ప్రౌఢి మెప్పించి త
ద్వరలబ్ధారుణ దీప్తి మౌళిగాని త
  త్త్రైలోక్య రక్షాత్రయీ
పరిణామ త్రిగుణత్వ వైభవము దో
  పన్ సారె గీర్తించు నై
ఖరి మ్రోసెన్ జరణాయుధంబులు త్రికే
  ఖాభుగ్న కంఠార్భటిన్' (4-25)

అని వ్రాశాడు త్రిముని సంభావ్యత్వాన్ని త్రికాలబోధకాన్ని తెలియచేసేందుకే కోళ్ళుకూస్తున్నాయని వివరించాడు. ఇది కేవలం వేళకోసం వేచియున్నట్టి వారికి సమయం సూచిస్తున్నట్టుంది

కవుల కావ్యాల్లో కోళ్ళు వేకువజామున కూసే విధానం, వాని ఆవశ్యకత వివరించారు త్రికాలజ్ఞానమున్న యీ జాతి శబ్ద ఆధారమే సరియైన కాలాన్ని తెలుసుకోడానికి తోడ్పడుతుంది. అయితే నింగిలోనున్న వేగురుచుక్క కూడా ఆధారం కాదా అన్నప్పుడు కొంతవరకాధారమని చెప్పొచ్చు భూపరిభ్రమణంలో చుక్కల తావులు మారుతాయి-గుర్తించేందుకు వీలు కాదు. మరియు అన్ని ఋతువులందు చుక్కలు కనిపించవు ఈ కారణమున కాలాన్ని తెల్సుకొనేందుకు కృకవాకువులే సరియైన ఆధారాలు

'చేతులారంగ నిన్ను పూజించుకొరకు
  కోడి కూయంగనే మేలుకొంటి నేను'

అని భక్తుడు గానం చేస్తున్న ఈ పద్యపాదంలో దైవపూజార్థం మేలుకొనేందుకు కోళ్ళతోడ్పాటు ఎంతో ఉంటుందని తెలుస్తుంది అంతటి ప్రాముఖ్యాన్ని తెలిసే ప్రసిద్ధకవులు తమ కావ్యాలలో కోడికూతలకు ప్రత్యేకత నొసంగినట్లుగా కోళ్ళప్రశస్తి మనకు కనిపిస్తుంది.

—(*)—

# రమణీయ కావ్యము - 'మొల్ల రామాయణము'

- భాషాప్రవీణ శ్రీమతి సౌపాటి అరుణకుమారి, ఎం. ఏ.

'వెలుగు తళుకు లీను ఈ ముత్తెపు సరాలు ధరించి కలికిచూపుల కడగంటి ప్రసారాలతో కళామయుల సుతిమెత్తని యెదలలో మాణిక్య దీపములు నిలిపి వెలుగులు పండించిన శారదాదేవి విమల దరహాస రేఖయే మొల్లరామాయణము' అన్న కాటుకూరి వారిమాట అక్షరాలా సత్యము.

ఈమె రామాయణమును ఆరు కాండముల పద్యకావ్యముగ రచియించి శ్రీరామచంద్రునికి అంకితము చేసినది ఇది మొల్ల రామాయణముని ప్రసిద్ధికెక్కినది మొల్ల కుమ్మర- కులజ యని చిరకాలమునుండి ప్రతీతి ఈమె భర్త పేరుగాని, ఇంటి పేరుగాని తెలియదు ఈమె తన తండ్రి శివభక్తిపరుడును, గురులింగ జంగమార్చన పరుడునైన ఆతుకూరి కేసన అనియు,తనకు శ్రీమద్గౌరీశ్వరుడైన గోపవరపు శ్రీకంఠ మల్లేశ్వరుని ప్రసాదమున కవితా సంపద లభించిన దనియు తన రామాయణములో చెప్పుకొనినది

మొల్ల జన్మస్థలమును గురించి అనేక - అభిప్రాయములు కలవు మనకేల ఈ గోల! కావ్యరసమును గ్రోలు! కొందరీమె విజయనగరాధీశ్వరుడైన కృష్ణదేవరాయల కాలమునాటి దనియు, ఈమె తన గ్రంథములో 15 వ శతాబ్దములో నుండిన శ్రీనాథుని మాత్రమే పేర్కొని అనంతర కవుల నెవ్వరినీ పేర్కొనక పోవుట చేత నా శతాబ్దికి సన్నిహిత యని మరికొందరి అభిప్రాయము

వాల్మీకి రచితమగు శ్రీమద్రామాయణము సర్వాలంకార సంశోభిత మగు మహాకావ్యము ఇది సర్వరసములకు నిలయము రామకథలో వస్త్వైక్యము (unity of plot) కలదు అందుచే పఠిత ఆసక్తితో తదున్ముఖు డగును ఇట్టి గుణముచే సామాన్యులకు, కావ్య నిర్మాణోత్సుకులగు కవులకు రామాయణము ప్రాణప్రదమైనది ప్రధానముగ అందలి ఆదర్శ దాంపత్య భావము సర్వులకు శిరోధార్యమై ఉపాస్యమైనది గదా!

తెలుగు సాహిత్యము పై రామాయణ ప్రభావ మతివేల మనియే చెప్పవచ్చు. అనేక మతములకు అనేక గ్రంథములు వచ్చినవి రామాయణ కథారచనము మాత్ర మీ సూత్రమున కపవాదముగనే మత ప్రసక్తియు లేక నన్నయ నాటి నుండి నేటివరకు జరుగుచునే యున్నది. ముఖ్యముగ రామకథ జన్మసాఫల్య కారి అను నమ్మిక వలన గ్రంథసంఖ్య విస్తృత మగుట కవకాశము కలిగినది

తెలుగున సాహిత్యప్రక్రియ లెన్ని కలవో అన్నిటను రామాయణ కథారచనము జరిగినది. విపుల కావ్యములుగ, సంక్షేప కావ్యములుగ, అచ్చతెనుగు కావ్యములుగ, ద్విపద శ్లేష కావ్యములుగ, దండకములుగ, యక్షగానములుగ, గేయములుగ, పాటలుగ, వచనకావ్యములుగ, స్వతంత్ర నాటకములుగ, అనూదిత నాటకములుగ రామాయణ కథావస్తు వాంధ్ర వాఙ్మయమున తామరతంపరగ వ్యాపించినది.

మొల్ల ప్రధానములగు కథాంశములతో రామకథను సంక్షేపించి వ్రాసినది రచన మార్దవోపేతమై గోచరించును పోతనార్యుని వలెనే—

'చెప్పు'మని రామచంద్రుడు
చెప్పించిన పలుకుమీదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్యచరిత్ర తప్పులెంచకుడు కవుల్'
అని తెలిపినది

ప్రౌఢపాండిత్యప్రకర్షకు,సౌందర్యము గులుకు శబ్దములు, స్వభావోక్తివర్ణనలు, అనౌచిత్య పరిహారణ, సంభాషణా చాతుర్యము, వర్ణనలలోని వైయక్తికత, నుడికారములు, జాతీయములు, పాత్రచిత్రణ మొదలగు వానియందు ఈమె కవితా శిల్పము వ్యక్తమగును మరల రామాయణ కావ్యరచన చేయుట యెందుకు? అని ప్రశ్నించుకొని తనలో తానే—

'భూజన కల్పకంబగుచు
భుక్తికి ముక్తికి మూలమైన యా
రాజును, దైవమైన రఘు
రాము నుతించిన తప్పు గల్గునే.
అని భావించినది

కనుకనే సర్వజనాకర్షకముగ రామకథా సంకీర్తనము చేసితరించినది మొల్ల తెలుగు కవిత్వమున కేయే లక్షణము లుండ దగునో సీస పద్యములో చెప్పిన తీరు ఆమె వినయవిధేయతలకు నిదర్శనమగును

'వలిపపు సన్నపయ్యెదను
వాసిగ గందపుఁ బూఁత తోడుఁతన్
గొలఁదిగ గానవచ్చు వలి
గుబ్బచనుంగవ రీతి నొప్పగాఁ
దెలుంగని చెప్పుచోట '

అను పద్యంలో కావ్యం ధ్వన్యాత్మకమై ఉండాలనీ, క్రొత్తరీతులలో వ్రాయాలని పలికినది ధ్వన్యాత్మకంగా వ్రాసినా-

తేనె సోకనోరు తీయన యగరీతి
తోడ నర్థమెల్ల దోచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యము
మూఁగ చెవిటి వారి ముచ్చటగును"

అని చెప్పినది అంతేకాక మరొక గొప్ప విషయం కూడా తెల్పినది. తెలుగు భాష

ఎంత సంస్కృత భాషా మయమైనా సంస్కృత కావ్యాలను తెలుగులో వ్రాయునపుడు "తమ విద్య మెఱయ" అనగా తమపాండిత్య ప్రజ్ఞలతో-'క్రమ్మఱ (ఘనముగ) సంస్కృతము చెప్పగా రుచి యగునే' అని సాకూతంగా కొందరిని అధిక్షేపించినది దీనిని రెండు విధాల చెప్పుకోవచ్చు. పూర్వ విరచితమైన రామాయణ రచనలు ప్రజల కందుబాటులో లేవనీ అయః పిండాలుగాను, గమికర్మీకృతనైక నీవృతంగాను తెలుగులో కావ్యాలు వ్రాసినచో ఏమి ప్రయోజనమనీ సన్న సన్నగా హెచ్చరించినది అదే మరల తాను రామాయణ రచనకు పూనుకోవడానికి కారణమన్నది స్త్రీయై యుండి కావ్య రచనకు పూనుకోవడానికి రామచంద్రుడు తనలో ఉండి చెప్పించడమూ, భక్తి, శక్తీ, కారణంకాని చదువు కారణం కాదని చెప్పుట ఇంకొక చమత్కారము.

## మొల్ల రచనా వైశిష్ట్యము

ఇది మహిళా విరచితమగుట వలన కృత్యాది యందలి త్రిమూర్తుల దేవేరుల వర్ణనలో ఒక ప్రత్యేకత ఉన్నది సుందరకాండవఱకు ఏకబిగిని సాగినది ఇందు పరిహరించిన ఘట్టాలు కూడా కలవు విశ్వామిత్ర యాగ సంరక్షణ సందర్భములో మారీచ సుబాహుల వధ సందర్భమున కూడా చాల మార్పు చేసినది లంకలో హనుమదన్వేషణ కుదించినది ఈ విధముగా ఆయా ఘట్టాలు త్యజించటములో కూడా ఆయా కవుల ప్రభావాలు ద్యోతక మగును రామాయణము దుష్టశిక్షణ శిష్టరక్షణలే ముఖ్యప్రయోజనములుగా గలది. కథా కథనమునకు భంగం గాకుండా కొన్ని కొన్ని ఘట్టాలను విడిచి వేయడము ఎవరికైనా అవసరమే ట్లు పరిహరించనిచో ఈ కావ్యాలన్నీ పురాణాలే అవుతాయి సంగ్రహ కావ్యాలు కానేరవు ఈ సందర్భమున కబంధవధను వదలి, శబరీ సంరక్షణమును చేపట్టుటలో మొల్ల హృదయ సౌమనస్యము, భక్తి, మార్దవము మనకు తెల్లమగుచున్నవి

## సంభాషణ చాతుర్యము

సంభాషణలు యుక్తితోను, సమయోచితముగానూ, వక్రోక్తి విరహితముగాను నడిపి "స్త్రీ కర్తృకం కాబట్టే యీ సంభాషణ నిపుణత ఈ కావ్యాని కబ్బినదా"? అనుకొనేటట్లు నిర్వహించినది సుందరకాండలో సుమారు ఇరువది పద్యముల వఱకు నడచిన సీతా రావణ సంవాదంలో- ఉదా -

'అలకేశ్వరుం డుపాయనముగా నిచ్చిన
యంచిత చీని చీనాంబరములు"

46 పం. సుం కాం

"జడలు ధరియించి తపసుల చందమునను
దమ్ముడును దాను ఘోరదుర్గమ్ములందుఁ
గూరగాయలు గూడుగాఁ గుడుచునట్టి
రాముడేరీతి లంకకు రాఁగలండు"

50 పం. సుం కాం.

అని తన వైభవాన్ని, శ్రీరాముని అల్పత్వాన్ని, సామాన్యతను చూపుతూ, తన యొక్క త్రైలోక్యవిజయ పరంపరలను చెప్పకుండా చూపించి చివరకు

'వ్రీడ యలంకారముగా
నాడుము భయ ముడిగి మధురమైన
మృదూక్తుల్
వేడిసల నేలు కన్నుల
జూడుము కను దెప్పలెత్తి సుదతీ నన్నున్'

57 ప సుం కాం

అని తన నీచమైన కోరికను, వ్యక్తము చేయుచు ఇట్లు సంభాషించిన యా అల్పునికి సీత యిచ్చిన సమాధానము-

'పతి దైవముగా నెప్పుడు
మతిదలచుచునుండునట్టి మగువల జెఱుపన్
బ్రతిన గల యట్టి నీతో
బ్రతివచనము లాడుకంటె పాపముగలదే

59 ప సుం. కాం

అని పరదారాపేక్షకు లగు పురుషులకాయువు నశించు నని పరదారాహరులను పరాస్తము చేసినది. ఇందు ముఖ్యమైనది శ్రీరామ శౌర్య ప్రతాప కథనము

'కూకటి ముడికిని కురులు గూడనినాడె
బెదరక తాటకఁ బీచ మణచె
గాధేయు డొనరించు క్రతువును రక్షింప
పెక్కండ్రు దైత్యుల నుక్కణంచె
నవనిపై శిలనిల్లు నఖిల రాజన్యులం
బ్రేల, జాపఁగ లేనివిల్లు విఱిచె
ఘోరాటవుల లోనఁ గ్రుమ్మరు నప్పుడు
ఖరదూషణాది రాక్షసుల జంపె'

అని, రావణుని హైన్య, నైచ్యములను తూలనాడి ఇంకను ఇట్లు పలికినది.

అట్టి రాముని కీయబ్ధి యనఁగ నెంత
లంక యన నెంత దనుజుల పొంక మెంత
నీవనగ నెంత, నీ లావు చేవ యెంత,
చెప్ప నేటికి నీవె చూచెదవు గాక"

65 ప.

"శ్రీరామున్ సుగుణాభిరాముఁ దెగడన్
జేకొన్న నివ్వాజిలో
దారన్ దొంగిలితెంచు నిష్ఠురగతిన్
దండించి ఖండింప "

ఈ విధంగా అధిక భాషణము చేయక ఎంతవరకు మాట్లాడాలో అంతవరకు మాట్లాడి రావణుని అఖండ ప్రగల్భములను నిరసించినది ఈ సంభాషణలోని సీతా ప్రతి వచనములలో స్త్రీ సహజమైన పొదుపు సమయోచితంగా తూచి

తూచి మాట్లాడి కార్యసాధన చేసుకొనే నేర్పు ప్రతి పదములోను స్పష్టమగుచున్నది

## ఔచిత్య పోషణము

ఇందు మొల్ల చాకచక్యము ద్యోతకమగును శూర్పణఖకు ముక్కు చెవులు కోసిన ఘట్టంలోను, హనుమ సీతాన్వేషణ సందర్భములోను మొల్ల స్వభావ పరిశీలన వైదగ్ధ్యాన్ని గమనించవచ్చు, సీత అశోకవనంలో ఏకాంతంగా దుఃఖించుచున్న సమయమున హనుమ సందర్భోచితంగా—

"ఉన్నాడు లెస్స రాఘవు
డున్నాడిదె, కపుల గూడి
యురుగతి రానై
యున్నాడు నిన్ను గొనిపో
నున్నాడిది నిజము నమ్ము మూర్వీతనయా"
91 పం సుం కాం.

ఈ పద్యమువలన సీత ఎంతో ఊరట చెందును రావణవధానంతరము "గవ్యాశావళికిని కూడు నోటికి బోయె, సురల కంటికి నిద్రపోవనంత" అని సహజతోపేతంగా పదజాగరూకతలో, చిక్కని మాటల పొదుపు, సార్థకపద ప్రయోగ విజ్ఞతా కావ్యం అంతటా ప్రతిబింబించుచున్నవి ఆయాపాత్రల సజీవ మూర్తులు ఈ కావ్యమంతటా పఠితల హృదయాలను అలరిస్తాయి 'కంటిన్ జానకి పూర్ణచంద్రవదనన్' అనే ఘట్టంలో మూలములోను 'దృష్టా మయా సీతా' అనునది యథానువాదమే కాని ఎత్తుగడలోనే ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది

( సశేషం )

# ఆధునిక నవలికకు శ్రీ కుటుంబరావు చేకూర్చిన సంపద

- శ్రీ సోమసుందర్

కుటుంబరావుగారు ఆధునికనవలిక అనే ప్రక్రియను బహుధంగుల సంపన్నయం చేశారు అరవైయేళ్ళ తాబ్దంలోని ప్రధాన పరివర్తన కాలాన్ని సుమారు ఏభయ్యేళ్ళ కాలాన్ని తన సృజనాత్మక సాహిత్యం ద్వారా ప్రతిబింబించారు వారి అరుణోదయం అనేనవలిక 1945 46 ప్రాంతంలో వెలువడింది ఇది అనేకవిధాలుగా విశిష్ట రచన అంతేకాదు, వారి నవలానస సమాహారానికి నిర్దష్ట ప్రతినిధిమాత్ర మైనది కూడ !

ఈనవలను నేనూ మామిత్రబృందమూ వెలువడిన కొత్తలోనే చదివాం ఎంతో తీక్ష్ణంగా చర్చించాం ఇన్నాళ్ళ తర్వాత ఓకస్థూల స్వరూపమే మనసులో మెదులుతున్న దితప్ప సూక్ష్మాంశవిశ్లేషణస్మృతిలో మెరవడం లేదు కనుకనే సరిగ్గా ఏసంవత్సరంలో వెలువడిందో సాధికారంగా చెప్పడం సాధ్యం కావడంలేదు

ఇప్పుడా గ్రంథాన్ని మా గ్రంథాలయంనుంచి తెచ్చుకొని పునఃపఠనానికి పూనుకొంటే ఎంతెంతో తెలివిపడి తలుపులు తెరుచుకొన్నట్లయింది కాని ఆ గ్రంథంమీద మొదటిముద్రణ ఏసంవత్సరాలో జరిగిందో ఎక్కడా తెల్పబడలేదు ఈ రెండవ ముద్రణకూడా యువ ప్రచురణగానే వెలువడింది

ఈనవలికలో ఆద్యంతమూ కాలానుక్రమణిక ద్యోతకమవుతుంది ప్రథమ ప్రపంచయుద్ధం ముగిసిన నాటిపరిస్థితులతో ప్రారంభమై, ద్వితీయ ప్రపంచ యుద్ధం ముగిసిన రోజులలో పరిసమాప్తమవుతుంది రెండవపుటలో రచయిత తనకృతజ్ఞత ఇలా ప్రకటించుకొన్నారు 'ఇందులోని కథాంశాలు పఠితలు ముందుగా గ్రహించ గలిగితే అధిక ప్రయోజనం ఉంటుం దనే నమ్మకంతో వీటిని వాహినీవారి స్వర్గసీమలోనుంచి సేకరించాను ఇందుకుగాను నాకు దయతో తమ అనుమతి నిచ్చిన వాహినీవారికీ, స్వర్గసీమ కథాకర్తలైన శ్రీ చక్రపాణిగారికీ కృతజ్ఞుడ్ని' అని ప్రకటించిన కుటుంబరావు నమ్మకం సఫలం కావాలంటే స్వర్గంసీమలోని కథాంశాలు పాఠకుని మనసులో కాని యిప్పుడీ నవల చదివేవారికీసూచనప్రాయంగానైనా సమాకరించదు నామటుకు నేను అప్పట్లో స్వర్గసీమ రెండు మూడుమార్లు చూడకపోలేదు కాని భానుమతి నటన, పాటలోతప్ప మరేమీ జ్ఞాపకం రావడంలేదు కనుక ఆ చిత్రంలోని కథాంశాలీ నవలికకు ఎలా ఉపయోగపడుతున్నదీ చెప్పడం సాధ్యంకాదు.

విమర్శకుడికి మిగిలింది ఎదురుగా నిలచిన అరుణోదయం, గ్రంథంతప్ప ఏ యితరేతరాధారాలూ లభ్యంకావడం లేదు కుటుంబరావుగారు కథానికా రచనకు ఎన్నో కొత్త పోకడలు సంతరించారు గల్పికలనేసంవిధానాన్ని ఒకవిశిష్ట ప్రక్రియగా ఆయనే ఆద్యులుగా ప్రచలితం చేశారు నవలలోగాని ఇతరత్రాగాని ప్రాధాన్యత వహించేది శీలపరిశీల ! కథాప్రణాళి (plot) గౌణమే! దేశీయ భౌతిక పరిస్థితుల సందర్భంగా ఒక మధ్యతరగతి వ్యక్తి మానసికంగా పొందేపరిణామాలూ, పరిస్థితుల ప్రాబల్యం వల్లపొందే విపరిణామాలూ స్పష్టరేఖలతో చిత్రింపబడతాయి ఏనవలిక చదువుతున్నా పఠిత బుద్ధికే ఎక్కువ పనికల్పించ బడుతుంది తప్ప కన్నీళ్ళు,పాదఘాతాలు,మాంగల్యబలాలు పాతివ్రత్యాల సొల్లువంటి సెంటిమెంట్లు, మెలోడ్రామాలూ, కవిత్వప్రపరిధిలోనికి

అంగవేసే ప్రకృతి వర్ణనలూ ఎక్కడా స్పర్శించబడవు

అరుణోదయంలోని కథాంశకూడా అల్పమైనదే! ఒక సంపన్న కుటుంబంలో పుట్టాడు రామ్మూర్తి మధ్యతరగతి మర్యాదలూ మప్పితాలు అతన్ని తీర్చి దిద్దాయి. ఫస్టుక్లాసులతో కాలేజి చదువు పూర్తిచేశాడు మొహమాటిగా, స్తబ్ధుగా మసులుతాడు పెద్దలార్జించిన ఇరవై ఎకరాల మాగాణి, ఒకయిల్లు ఉంది. ఇద మిత్థంగా పోల్చుకో జాలని అభిరుచులూ కొన్ని ఉన్నాయి అందుకే విద్యాభ్యాసం పూర్తికాగానే నేరుగా ఉద్యోగంలో చేరాడు కల్యాణి అనే అమ్మాయితో పెద్దలువివాహం చేస్తారు (అతని తల్లితండ్రులూ, తోడబుట్టినవాళ్ళూ ఉన్నారో లేరో భోగట్టా నవలికలో దొరకదు) ఆ అమ్మాయి కూడా అతనికి తగిన స్తబ్ధే! ఆధునిక చైతన్యంలేదు కనుక దాంపత్యం పొరపొచ్చాలు లేకుండా సాగిపోతుంది అతని నిర్వ్యాపారత లోకంలో న్యూనతను దోహదంచేస్తుంది మిత్రుల ఒత్తిడివల్ల క్లబ్బులో చేరతాడు అక్కడ మిత్రులూ సహపాఠులూ ప్రథమశ్రేణి విద్యార్థిగా అతన్ని గౌరవిస్తారు ఆవిధంగా కైవారా లందుకుంటూ కొంత ఆత్మవిశ్వాసం పుంజుకుంటాడు

సాంబశివరావనే మిత్రుడు అతన్ని ఆశ్చర్యంలో ముంచుతాడు. ఆనాటి ప్రథమశ్రేణిరంగస్థలతార లంతా-యడవల్లి సంజీవరావు, హరిప్రసాదరావు, కోపల్లె హనుమంతరావు, ప్రభృతులంతా అతనికి సన్నిహితమిత్రులని తెలుసుకుంటాడు దివాస్వప్నాల్లో ఊగిపోతాడు అతని తలదన్నినట్లు సీతారామయ్యకు ఆనాటి భావకవిబృందమంతా ఆత్మీయులని తెలిసి మరీ తెల్లబోతాడు

తన కా యోగం లేదు వాళ్ళంతా భూమికిబారెడెత్తున నడిచేదేవతలు! సభాపతి శివశంకరశాస్త్రి, గిరజాలకవి కృష్ణశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, వంటి వారంతా తమఊరికే వచ్చినట్లు తెలిసింది. ఆనాటి సాయంత్రం నేరుగా తమక్లబ్బుకే వచ్చి కేవలం గంధర్వలోకంగా మార్చివేశారు. కృష్ణశాస్త్రి చదివిన పద్యాలు రామ్మూర్తి తలలో జోరీగల్లా చేరి తోచనివ్వలేదు కృష్ణశాస్త్రి, పద్యాల తుంపులు-ఏననంత శోకభీకర తిమిర లోకైకపతిని, కంటక కిరీటధారినై కాళరాత్రి' వంటివి అతనిమనసునిండా చేపల్లా ఈదులాడుతున్నాయి

రామ్మూర్తికి అంతకుపూర్వం చెప్పుకోతగ్గసాహిత్యాభిమానం ఏమీలేదు కవిత్వమంటే పాతపద్యాలలో - ప్రబలినన్న వాళ్ళు రాయగల రనికూడా అతనికి తెలియదు కానియిప్పుడీకవులపై ఎడతెగని ప్రేమాభిమానాలు ముంచుకొచ్చాయి. సమావేశంముగిసి వాళ్ళువెళ్ళిపోతుంటే-బెంగతో డీలాపడిపోయాడు. కూడా నడచాడు సీతారామయ్య యింట్లో డాబామీద చాలరాత్రి వరకు గోష్ఠి జరిగింది ఈవిధంగా కలిగిన కవుల పరిచయం ఊరకేపోలేదు బలవంతంగా రామ్మూర్తిని సాహిత్యంలోకి నెట్టింది

పద్యాలు గిలకడానికి ప్రయత్నించాడు సహృదయులు కూడా అంత బాగా కుదరలేదన్నారు తన కావిద్య పట్టుపడదని త్వరలోనే తెలుసుకొని గేయ రచన కుపక్రమించాడు. సభాపతి ప్రోత్సహించకపోలేదు కాని అతనికా ధైర్యం లేకపోయింది 1924 నాటికి కవుల స్నేహం బాగా సన్నిహితమైపోయింది ఒకటిరెండు చిరుపొత్తాలు అతనికి అంకిత మయ్యాయికూడా!

ఈదశలోనే తలవని తలంపుగా అతనో కథరాశాడు అందులోని కథాంశంలో నూతనత్వం ఏమీలేదు ఒకప్లీడరు క్లయింటుగావచ్చిన వేశ్యవలలో చిక్కుకుంటాడు ఇంటిమొగంచూడడు పిల్లలు జబ్బుతో మంచానపడతారు వైద్యుణ్ణిపిలిచే దిక్కులేక చచ్చిపోతారు ప్లీడరుకు హృదయపరివర్తనం వస్తుంది భార్యదగ్గరకి చేరుకుంటాడు. ఈ కథలో నూతనత్వం ఏమీలేదు కనుకనూ, రచనాశిల్పంలో కూడ ప్రత్యేకత లేదు కనుకనూ, గొప్పకథ కాదనుకోవడంలో రామ్మూర్తి సామాన్య విమర్శకులు పడే పొరబాటే పడ్డాడు ' అంటారు కుటుంబరావు, ఆ పొరబాటేమిటో తర్వాత దీర్ఘంగా 14వపుటలో వివరిస్తారు.

ఈసందర్భంలోనే కథకులుగా కీర్తి పొందడానికి పాటించవలసిన చిట్కాలు రెండు బోధిస్తారు కొడవటిగంటి!! అవి ఏవనగా 1) ప్రఖ్యాత కథకుడు కాదలచినవాడు రాసే ఒకకథనుకూడా చాలాసార్లు రాయకూడదు సంవత్సరానికి ఒకటీ రెండూ చొప్పున కథలు రాసే వాళ్ళకు ఖ్యాతివచ్చినంత త్వరగా నెలకు నాలుగు కథలు రాసేవాడికి రాదు సాత్త్వ్యం పెరుగుతున్నకొద్దీ న్యాయాధికారికి విసుగెత్తినట్లు- ఈకథారచనలో యంత్రపరిశ్రమను చూసి సంఘం విసుక్కుంటుంది మిగిలిన ప్రసిద్ధ కవులల్లే ఒక్కకావ్యం రాయక, అనేకంరాసి, శ్రీనాథుడు సంఘందృష్టిలో అకుగున పడిపోయినాడు కథకులగతి అయినా అంతే! 2) కొద్దికాలంపాటు కథలురాసి కలం ముడిచి పెట్టడం ఇంకారాస్తూన్న కథకుడ్ని గురించి ఏమనుకోవాలో సంఘానికి తెలీదు ఐదో ఆరో కథలు రాసి కలం దాచేసిన వాణ్ణి గురించి లోకం సాత్వికాభిప్రాయం ప్రకటిస్తుంది అతని లోపాలు సులభంగా క్షమిస్తుంది అతన్ని ఏదోవంక చూచుకొని నిస్సంకోచంగా పైకి ఎత్తేస్తుంది' అంటారు నిజాని కీరెండు చిట్కాలూ నిజమే అనుకొనే అమాయిక ...

త్యంలో కొందరల్పప్రతిభులెలా ఎందుకు కీర్తిమంతు లవుతున్నారా అనే సందేహంతో కొడవటిగంటి యిలా ఎత్తిపొడుస్తున్నారు! ఇలాంటి వక్రోక్తులూ, చమత్కారాలు ఆయనకు కొట్టినపిండి!

మొత్తానికి రామ్మూర్తి ఐదారుకథలే రాశాడు. ఇంతలోకే చెడ్డరోజులు ముసురుకున్నాయి పల్లెటూళ్ళో ఉన్న అతని భూములపై మామవరస దూరపు బంధువు పెత్తనం చేస్తూ బాగా చేతివాటుకు అలవాటు పడ్డాడు అటు రైతుల నించీ లంచాలు లాగుతున్నాడు ఇటు అవసరానికి రామ్మూర్తికి అప్పుతూ పేణా డబ్బుసర్దుతూ వడ్డీలకు వడ్డీలూ పెంచుతాడు ఈవిధంగా అప్పుఆస్తితో సమానమైనట్టు ముల్లుచూపింది 1930 వచ్చింది దుర్భర ఆర్థిక మాంద్యం తెచ్చింది. అందరూ భూము లమ్మేవాళ్ళే! కొనే నాథుడు లేడు సెంటుభూమి మిగలకుండా వదల్చుకునేసరికి అప్పులన్నీ పోను రెండువందలు మిగలడం మహాభాగ్యమనుకొన్నాడు రామ్మూర్తి!

“1930 నాటి ఆర్థిక నాటకంలో నుంచి అనేకం పుట్టినై తెలుగువాళ్ళ సంస్కారజీవితంలో కలిగిన నూతన దృష్టిలో చెప్పుకోతగినవి పత్రికలూ టాకీలూను” అని వివరిస్తారు రచయిత! ఆయన నవలికలో ఈనాటకం తాలూకు విషచ్ఛాయలు చాలావాటిపై పరచుకొన్నాయి మధ్యతరగతిని చావుదెబ్బ తీసిన గడ్డు పరిస్థితులను వాస్తవికతావాదరచయిత విస్మరించలేదు.

(సశేషం)

# అద్దేపల్లివారి కవితాహాసము - ఋతువిలాసము

- శ్రీ జి. బి. ఎన్. ఆచార్య, ఎం ఏ, పి. హెచ్ డి.

(గతసంచిక తరువాయి)

కావ్యాంతమందు ‘ఋతుషట్కము’ అనే శీర్షికలో ఆరు ఋతువులను సామూహికంగా విలక్షణ భావంతో అభివర్ణించి, సంవత్సరైక్య దృష్టిని వెలయించటం ఈ కావ్యంయొక్క ప్రత్యేకలక్షణం ఋతుషట్కమున మానవజీవిత మందలి వివిధావస్థలను ఆరోపించటం అభినందనీయం.

(వసంతము - బాల్యము, గ్రీష్మము - కౌమారము, వర్షాశరత్తులు- యౌవనము, హేమంతశిశిరములు - వార్ధక్యము వసంతము ఐశ్వర్యవంతమైన దనీ, గ్రీష్మము వీర్యవంతమైనదనీ, వర్షము యశోవంతమైనదనీ, శరత్తు స్వచ్ఛమైన దనీ, హేమంతము జ్ఞానవంతమైన దనీ, శిశిరము వైరాగ్యసమన్వితమైన దనీ సంభావించి, షడృతువుల-షడ్గుణైశ్వర్యములను ప్రతిపాదించటం ప్రశంసనీయం ఇంకా ఆరు ఋతువులను పాండవులతోను, ద్రౌపది తోను అన్వయించి చెప్పటం కవిగారి భావనావైశిష్ట్యాన్ని తెలుపుతున్నది (వసంతము-ధర్మరాజు గ్రీష్మము-భీముడు, వానకారు-పార్థుడు, శరత్తు, హేమంతము-నకులసహదేవులు, శిశిరము- ద్రౌపది)

ఋతుషట్కము జీవితపుష్పమాలికమును గ్రోలు షట్పద మనీ, ద్విజాళికి ముఖ్యమగు యజనాదిషట్కర్మలసమమనీ, వీరవిక్రమమూర్తియైన వేల్పుదళవాయి షణ్ముఖు డనీ అనిపిస్తున్న దని చెప్పటంలో ఎంతైనా ఔచిత్యం వుంది

ప్రకృతికాంతకు రెండుమాసాల కొకటిచొప్పున వత్సరమునకుఆరు మంచిచీరెలట ఆమనిలో మావిచివురురంగు కలిగిన మహిత చేలమును, వేసంగిలో కనులకు మిరుమిట్లు కలిగించే వెలిపట్టుచీరను, వానకారులో మాపున కాగునటువంటి మబ్బురంగుచీరను, శరత్కాలములో వెన్నెల రంగుచీరను, హేమంతములో మంచు రంగుచీరను, శిశిరములో చలి కాగునటువంటి మానుగావిరంగు చీరను, కడుతుందని వర్ణించారు. ప్రకృతికాంత ఋతుధర్మాల కనుగుణంగా వస్త్రాలంకరణను చేసుకోవటం స్వభావసిద్ధమును, రసికజన మనోరంజకమును అయి వున్నది

‘ఆవిరాట్పురుషుండు గావించు యాగమం
దామని చివురులే హోమశిఖులు
ఆవిరాట్పురుషుండు గావించు పవనమనం
దిద్ధమౌ గ్రీష్మాళి యిధ్మవితతి
ఆవిరాట్పురుషుండు గావించు హవములో
స్రుక్స్రువంబులు మంచు సోనకార్లు
ఆవిరాట్పురుషుండు గావించు మఖములో
మహిశరచ్ఛయము నిర్మలహవిస్సు
వృద్ధశిశిరర్తుతతియె ఋత్విక్చయంబు
విశ్వకళ్యాణసిద్ధియే విమల ఫలము
ఆది, యంతంబు గనరాని యాగమిద్ది
దీని కిలఁ జక్కఁ బోల్ప నెద్దియగు సుద్ది!’

కాలమును విరాట్పురుషునిగా సంభావించి, ఆతడు విశ్వకల్యాణంకోసం చేసే యాగమునందలి వివిధపరికరములే ఋతువులని అన్వయించటం ఉదాత్తతనుకలిగియున్నది ‘విశ్వశ్రేయఃకావ్యం’ అనేదాన్ననుసరించి, ‘విశ్వకల్యాణసిద్ధియే విమల ఫలము’ అని తమకావ్యాన్ని మంగళాంతము చేసారు ఇది సత్సంప్రదాయసిద్ధ

మును, సహృదయ సంవేద్యమును అయి వున్నది వసంతలక్ష్మీ మాధవుల కల్యాణముతో ప్రారంభించి విశ్వకల్యాణ భావనలతో ముగించటం ఈ కావ్యముయొక్క విశిష్టతను చాటుతున్నది

ఈ అనంతసృష్టిలో ప్రాణికోటి మనుగడపై ఋతుషట్కము విడదీయరాని విశిష్ట ప్రభావాన్ని కలిగియున్నది నిత్యమై ఋతుచక్ర పరిభ్రమణము మానవజీవితానికి, భూత భవిష్యద్వర్తమాన విషయాలను వివరించి చెపుతుందనే వుదాత్త సందేశాన్ని ఈ కావ్యం ప్రబోధిస్తున్నది

ఈ కావ్యం ప్రత్యంతప్రౌఢమైన కవిగారి ప్రతిభా పాండిత్యాలను ప్రత్యక్షమొనరిస్తున్నది వర్ణన లన్నింటియందు కవిగారి పరిశీలన, మానవజీవనపరిశీలన చక్కగా వ్యక్తమౌతున్నాయి ధారాశుద్ధి శోభితాలై పద్యాలన్నీ అవిచ్ఛిన్నంగా సాగిపోయి, కవిగారి కమనీయకవితాశక్తిని ప్రస్ఫుటం చేస్తున్నాయి ఈ కావ్యంలో సంప్రదాయనవ్యతల అపూర్వసమ్మేళనం క్షీరనీరన్యాయమున మనోజ్ఞమైయున్నది

కవి సమాజానికి అతీతుడు కాడనే విషయానికి ఈ కావ్యం నిదర్శనంగా నిలుస్తుంది వర్ణన కవితకు,వస్తుకవితకు దర్పణమైన ఈ కావ్యం ఆధునికాంధ్రసాహిత్య శారదకు 'అభినవ రామకృష్ణుల అక్షరాభిషేకము - నవ కవితా శిల్పము న అనల్ప కల్పకము

# రాధ — మధుర గాథ

- డా పూసపాటి భాగ్యలక్ష్మి ఎం ఏ పిహెచ్ డి

( గత 2వ సంచిక తరువాయి )

ప్రణయ పాటక పీఠము నలంకరించి యున్న రాధాపాత్రయు రాజహర్మ్యము నధిష్ఠించుటకు ఏర్పరుపబడిన సోపానములలో ముఖ్యమైనది వెలిదండ్ల వెంకటపతిచే రచింపబడిన 'రాధామాధవ సంవాదము

ఈ కావ్యమునందు రాధ నందుని ముద్దుచెల్లెలు చిన్నతనమునందే ఒక అనామధేయుని వివాహమాడి వానిని మగడని చూడక విడిచిపెట్టినది కనుక వివాహితయైన స్త్రీయగుటచే ఈ కావ్యమున రాధను పరకీయగ పేర్కొనవచ్చును కాని ఈ కావ్యమునందే

'గతి వీడంచును చిన్ననాడు తమ పె
  ద్దల్ కన్ బెద్ద లొప్పింతు ర
వ్వతె కవ్వాడు మగండు కావరు మనో
  వాక్కాయకర్మంబులం
బతి యెవ్వాడని తోఁచె వాఁడె పతిగా
  భావించు నాకే పతి
వ్రత నాసమ్మత మీమతంబు చెడు ద్రో
  వన్ బోవనే వత్తినే
    రాధా మా సంవా ఆ 1, ప 79

అని మనోవాక్కాయకర్మలచే మగనిగ భావించిన వ్యక్తియే భర్త యగును గాని చిన్ననాడు పెద్దలచే నియమింపబడిన వ్యక్తి భర్త కాడని రాధ అభిప్రాయపడినది ఈ సిద్ధాంతాధారముగ రాధ పతివ్రతయే అని చెప్పవచ్చును

ఈ కావ్యమునందు రాధ చిన్నతనము నుండియూ కృష్ణుని పెంపకపు బాధ్యతను స్వీకరించినది శిశువునకు చేయు పరిచర్య లన్నియూ 'భావిఫలాభిలాష' తో చేసిన దని కవివర్ణన అనగా కృష్ణుని తన తొలినోముల పెట్టపంటగ, జీవన జీవనమ' గ భావించినది నూత్నయౌవనమును పొంది తన సొగసునకు అనువగు ప్రియుడు లే డని ఆరాటమును పొందినది అచిరకాలముననే కృష్ణుడు పెరిగి తన మనోరథము తీర్చునను ఆశ ఆమె మానసవీథియందు ఉదయించినది ఈవిధముగ బాలకృష్ణునియందే శృంగారమూర్తిని చూచినట్లుగ ఆమె పొందిన శృంగార విభ్రమము, నవచైతన్యము, ఆమె తన పెంపకపు సొంపులతో మేళవించి, అతనికి వలపును నేర్పినవిధము, ఈ కావ్యమునందు రమణీయముగ వర్ణింపబడినవి

ఈ కావ్యమునందు రాధ అతిప్రౌఢ ఆమె వాక్చాతుర్య వైదుష్యములు ఈ కావ్యమునం దంతటను వెల్లవిరియుచున్నవి రాధ తనమనోవ్యథను అన్యాపదేశముగ పలుకులతోడను, వలపుల కులుకుల తోడను శ్రీకృష్ణునకు వివరించినది పురజనులు తనపై అపవాదములు వేయుచుండినట్లు అతని కెరింగించినది వచ్చిన అపవాదములు ఎటులైనను వచ్చినవిగాన వానిని నిజముచేయుడు మని మనసులోని మర్మమును వివరించినది తమ బాంధవ్యమును అనుమానించవలసిన అవసరము లే దని ఈ విధముగా పలికినది

చూడ నేర్చిననాఁడె సొలపుగా మును
  మున్నె కేరంగననుఁ గటాక్షించినావు
నవ్వ నేర్చిననాఁడె ననువుగాఁ దొలుదొల్త
  నాతోడ నగఁ గల్గ నవ్వినావు
పల్క నేర్చిననాఁడె భావంబుగా ముందు
  నత్త త్తరమ్మని యాడినావు
నడువ నేర్చిననాఁడె నమ్మికగాఁ దొల్త
  దొడరి చేపట్టి కాల్ ద్రొక్కినావు
నాడు సేయని యోజన నేడు గలదె
మరుడు దైవంబు సాక్షులు మనములు

విను సదాచార నిరతులు విబుధులైన
ఘనులు తారాశశాంకులు గారె మనకు
ధా మా సంవా అ 1 ప 48

ఇందు రాధ తనమనసును స్పష్టపఱచినది తమ వివాహము ఏనాడో జరిగిన దానినిగ వివరించినది అందులకు సాక్షులుగ మనసును మన్మథుని తారశశాంకులను పేర్కొనినది జన్మించిన దాదిగా జరిగిన వివాహోదంతము జన్మజన్మల అనుబంధముగ నిరూపించి ఆపనులు చేసినవాడు చేయని యోచనము నేడు అనవసర మని పలికినది 'అత్తనం బెనేని అత డారయుమ్మంతుడౌను' అనుచు వేదోక్తముల నెత్తి చూపినది పెంచి పెద్దచేసిన వృక్షముయొక్క ఫలములను ఆశించుట నేరము కాదని పలుకుట, కాముకులకు వావివరుసేల ప్రసక్తికే దని భారతిని బ్రహ్మను పేర్కొనుట, వావివరుసలు తనువుల కర్మమా, జీవధర్మమా? అని ప్రశ్నించుట ఇవి అన్నియు రాధ వైదుష్యమునకు నిదర్శనములు ధర్మసూత్రములు స్మృతులు, పురాణములు మొదలగు వానిని పేర్కొనుచు శ్రీకృష్ణునివాదమును పూర్వపక్షము చేసిన ఆమె వాక్చాతుర్యము అత్యంత రమణీయము

చిన్నతనమునుండి రాధ ముచ్చటలో పెరిగిన శ్రీకృష్ణుడు ఒక్కసారిగ ద్రేపల్లెను వదలి మధురావాసియైనాడు ఈవియోగమును సైరింపలేని రాధ తన చిలుకను మనోమన్మథుడగు మాధవుని మందిరమునకు రాయబారిగ పంపినది ఆమెను ఓదార్ప వెనువెంటనే యేతెంచిన శ్రీకృష్ణునితో తనమనసులోని ప్రేమనుదాచి, పైకి నిష్ఠురవాక్యములు ప్రారంభించినది 'గ్రాత్తసంసారికి ఈ పల్లెవారితో ఏమి పని' అని ఉపాలంభించినది

ఎనిమిది రసములు గాంతల
నెనమండ్రను బెండ్లియాడి యిక
నొక కొదువై
పెనుపొందు హాస్యరసమున
గన మచికసేయవచి నాడవె కృష్ణా!'

అని తన్ను పరిహసించుటకు కృష్ణుడు వచ్చినాడని తలచి, అతనిని దూరముగనే ఉంచి వెక్కివెక్కి ఏడ్చినది ఈ సందర్భమున ఆమె పలుకులందలి తీక్ష్ణత్వము, ప్రౌఢత్వము ఆమె వాగ్విలసనమునకు పరాకాష్ఠ్థతి

ఈ కావ్యమునందు పేర్కొనదగిన మరియొక లక్షణము రాధ వ్యక్తిత్వము ఇందు మరియొకయువతి సౌందర్యాకర్షణమున భర్త తన్ను పర్యుదాసము చేయునేమో అను అనుమానమున, గోరంతను కొండంతలుగ భావించునట్టి దుఃఖశీల కాదు రాధ ఈమె చంద్రుని అనుసరించిన చంద్రికవలె శ్రీకృష్ణునితో మధురానగరికి వచ్చి అతని ప్రేమసామ్రాజ్యాధిరాజ్ఞి యైనది తనరాక అతని భార్యల రవరవలకు కారణమైనట్లుగ పెంపుడు చిలుక పలుకులవలన విన్నది స్త్రీ సహజమగు దయాహృదయముతో ఒక్కక్షణము ఆలోచించి, సాటి ఆడువారి హృదయము నవగతము చేసికొని తానట్లువారి హృదయేశుని తన ప్రేమతో బంధించియుంచుట సమంజసము కాదని తలచినది కృష్ణుని ప్రేమను పొందుటకు అందరును సమానాధికారు లని తలచి, అతనిని ప్రార్థించి అతని ప్రేమను అందరికి పంచియిచ్చుటకు నియమముల నేర్పరచినది ఈ కల్పనమువలన ఎల్లనాయకుడు స్త్రీ హృదయ సామాన్యమైన ఈర్ష్యాసూయలు తొలగించి, నిండైన మనస్వినిగ ఆమెను తీర్చిదిద్దినాడు

ఇట్లు, శ్రీకృష్ణుని ప్రేమసామ్రాజ్యము నేలిన మహారాజ్ఞిగ ప్రౌఢవచస్వినిగ, నిర్వహణ చాతురిగల మనస్వినిగ రాధ వ్యక్తిత్వమునందలి వివిధాంశలు ఈ కావ్యమునందు ప్రదర్శింపబడినవి

రాధా చరిత్రమును మలుపుత్రిప్పిన మరొక కావ్యము ముద్దుపళని రాధికా సాంత్వనము ఇందు రాధిక రాజగోపాలుని పట్టమహిషి యగు ఇళాదేవిపై అతని ధీరక్షమత్కారము గలిగిన ప్రేమమూర్తి అనవరతానురక్తిచే హృదయమందిరమున శ్రీకృష్ణుని ఆరాధించిన అనురాగవతి అతనిని ఇంచుకైన వీడియుండజాలని విరహోత్కంఠిత అంతేకాదు కులాచార సంప్రదాయముల నెరిగిన ప్రౌఢగృహిణి సేవకులపాలిటి పెన్నిధియైన అధికారిణి సర్వశాస్త్ర ప్రాగల్భ్యముగల విదుషీమణి కామవాంఛా సుఖాలయసీమల నేలిన రాజ్ఞి ముద్దుపళని కొంతవఱకు ఈపాత్రను, తిమ్మనార్యుని సత్యభామ అడుగుజాడలలో నడిపించినది కాని ఇందలి చిత్రణ స్వయంప్రకాశనము కలిగినది కాలప్రభావమునకు లోనై కవయిత్రి ఈ కావ్యమున అతివేలమైన శృంగారమును రంగరించినది అందుచే ఈ కావ్యమునందలి రాధయందు ప్రౌఢశృంగారముమాత్రమే నిలిచి మిగిలిన గుణములు మబ్బుమాటుననున్న తారకలైనవి

రాధాదేవి చరిత్రమును వర్ణించిన మరియొక కావ్యము యడవల్లి వెంకటపతి కృత రాధామాధవ సంవాదము (అముద్రితము మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము D No 697) పాలకడలిని మథించిన సమయమున జన్మించిన హారిశోరిణి అను అప్సరస హరియందు అనురక్తిగలిగి నిరంతరము అమితభక్తితో సేవించుచు లక్ష్మీదేవి మాత్సర్యమునకు గురియై భూలోకమున జన్మించినట్లు ఈ కావ్యమునందు రాధను గూర్చి పేర్కొనబడినది

ఇందు రాధ శ్రీకృష్ణుని బాల్యమునుండి పెంచిన మమతామూర్తి 'కాపురమూ దీర్చు సందడియందు' యశోద బాలుని విషయమున ఏమరి యుండునేమో అని తలచి నందుడు శ్రీకృష్ణుని పెంపకపు బాధ్యతను తన ముద్దుచెల్లెలగు రాధకు అప్పగించినాడని కవి వివరించినాడు రాధ శ్రీకృష్ణుని పెంచు విధానము ఈ కావ్యమున అత్యంత మనోహరముగ వర్ణింపబడినది

దృష్టికి కనరాని దేవోత్తముని పరి
స్ఫుటఫాలమున దృష్టి బొట్టు పెట్టు
జగములెన్నైనను చాలని కౌరి గ
ర్భము నిండవలె నని పాలువోయు
సామగానమున నిచ్చలు ప్రొద్దుగడపెడు
మూలతత్త్వము మీద జోలపాడు
పేరులేని మహామహు పేరబిలుచు ,

చిన్నికృష్ణుని కంటికి రెప్పవలె పెంచుట, అతడు రోదించు సమయమున యశోదను పిలుచుట, అతనికి దృష్టి తగులునేమో అని అంగరక్షలు కట్టుట, మిగిలిన గోపకామినులు కృష్ణుని ముద్దులాడగ చూచి భరించలేక పోవుట - ఇవియన్నియు కృష్ణుని పెంపకమునందు రాధకుగల మమతను నిరూపించుచున్నవి

బాలకృష్ణునియందు రాధ అనురాగమును పొందినట్లు ఇందు వర్ణితము. 'నవనీరదవర్ణునిపై మోహ మతిశయింప' రాత్రింబవళ్ళు ఒకేవిధముగ యోగినివలె, నిర్జరయువతివలె అనిమేషయై, గడపసాగినది కృష్ణునికంటె వయసునందు పెద్దయగుట, వరుసకాదని తలచుట, అత్తింటి కోడలగుట అనుమూడు కారణములు కృష్ణునిపై ఆమెకుగల అనురాగమును వెల్లడించుటకు ఆటంకములైనవి కృష్ణుడును ఆమెయందు అనురాగము పొందియుండుటచే పేదరాశిపెద్దమ్మను ఆశ్రయించి రాధమనసుమార్చి ఆమెను పొందినాడు. ఇట్లు ఈ కావ్యమున రాధయందు అనురాగమున్నను దానిని వెల్లడించుటకు భయపడిన దానినిగ, దుస్సహతరమగు విరహమును భరింపలేని దానినిగ వర్ణించినాడు శ్రీకృష్ణుని పెంపకమునందును, ఆమె పెంచుచున్నది పసిబాలునేయైనను ఒక పరమాత్ముని సేవలు చేయుచున్న భావము ఆమె అనుభవించినట్లు ఈ కావ్యమున స్ఫురించుచున్నది. భక్తరక్తులచే భగవానుని మెప్పించి చిన్నతనమునుండి అతని సేవచేయు భాగ్యము, అప్సరస యగు తాను పొందలేని అదృష్టము పొందుటఅనునవి వరములుగ, మానవజన్మము నందిన దేవతాస్త్రీయని రాధను వర్ణించుట ఈ కావ్యమునందలి ప్రత్యేకత

ఇట్లు రాధగాథకు సంబంధించినవాఙ్మయమును పరిశీలించిన రాధ లక్ష్మీదేవి అవతారముగ, కృష్ణుని దేవేరిగ, ప్రబంధ నాయికగ వర్ణితమైనదని తెలియుచున్నది సంస్కృత వాఙ్మయమునందు అలౌకిక పాత్రలుగ చిత్రింపబడినరాధామాధవులు తెలుగు వాఙ్మయమునందు లౌకిక మూర్తులైనారు కాని నేడు ఆధునిక లోకములో విశేష ప్రచారమునందున్నట్టి రాధమూర్తి ప్రాచీన-తెలుగు వాఙ్మయములో కనిపించుటలేదు. రాధాకృష్ణ ప్రణయమును, అమలిన శృంగారపు తీరుతెన్నులతో మధురముగ, పవిత్రముగ తీర్చిదిద్ది ఆ రాధావాఙ్మయ స్రవంతిని మరియొక మలుపు త్రిప్పినది, ఆధునిక వాఙ్మయము

'తీయతీయని బరువు మోయలేదీ బ్రదుకు ప్రోయింప కోయి మురళి ప్రోయింపకోయికృష్ణ' అని రాధను పరవశము నందిన ప్రణయినిగ, భువన మోహనశీలగా ముగ్ధగోపికగ విరహోత్కంఠితగా, ప్రియుని అన్వేషణలో సర్వము మరచిపోయిన అనురాగమూర్తిగ ఎన్నియో రీతుల వర్ణించినాడు కృష్ణశాస్త్రి వేదుల సత్యనారాయణ గారి కావ్యమునందు 'పవన పులకితచంద్రాత ప్రప్రఫుల్ల' చారు శారదయామినీ సమయమందు మధురానగరి వీథివీథులందు వెదకివెదకి చివరకు బృందావన సీమచేరి, రాగవల్లికలు చిగురింప ప్రణయగీతిక లాలపించె కాగలించి గోపాలకృష్ణ! ప్రేమదీరగ నొక ముద్దుపెట్టుకొనుము' అని ప్రార్థించిన ప్రేమమూర్తియైన అమాయిక యువతిగ రాధ చిత్రింపబడినది, చెల్లరె యీమధుపవన సీమల నావులగాచువానికై పల్లెనుండి నాగరక పద్ధతులేమొ ఎఱుంగనట్టి ఆ'గొల్లపడంతులెల్లరును కోరినకోరిక గాక' అని పలికి ఆనల్లనివానిని వలచుట ఎంత లజ్జింపవలసిన విషయమని విరహమయియై మనోవేదనయందు శ్రీకృష్ణుని ఉపాలంభించిన విరహోత్కంఠితగా కొండాలివారు రాధను తీర్చిదిద్దినారు హృదయమున ఇంతటి బడబాగ్ని దాల్చిన రాధను అత్యంతకరుణామూర్తిగ కరుణశ్రీ కన్నులయెదుట నిలువబెట్టినాడు

రాధనురా ప్రభూ! నిరవ
రాధనురా! అనురాగభావనా
రాధన మగ్నమానసను
రా! కనరా! కరుణింపరా'

అని శ్రీకృష్ణుని ప్రార్థించు ముగ్ధ వీరిరాధ. స్నిగ్ధప్రణయ భావనముతో మధురాతి మధురమైన బాధతో వేదనచెందుచున్న ప్రణయమూర్తిగ సామవేదము జానకిరామశర్మగారు రాధాప్రణయమును పాటలుగ వ్రాసినారు ఇట్లు ఆధునిక సాహిత్యము రాధాకృష్ణప్రేమ తత్త్వమునకు అత్యంత ప్రాధాన్యము నిచ్చి ఆమెను నిత్యము స్మరించుకొను ప్రణయదేవిగ తీర్చిదిద్దినది

ఈ విధముగ పురాణవాఙ్మయముతో ఎట్టి సంబంధ బాంధవ్యములు పెట్టుకొనక ఆంధ్రసాహితీస్రవంతి స్వచ్ఛందముగా స్వతంత్రముగ ప్రవహించుచు రాధాచరిత్రను తీర్చిదిద్దినది రాధ వ్యక్తిత్వమున క్రమముగా విరిసిన పూరేకుల వంటి గుణములను ఈవిధముగా పేర్కొనవచ్చును ప్రశాంతగాఢ ప్రణయము, నారీసహజమైన చాంచల్యము, అపాయరహితమగు ప్రణయకోపము, హృదయవినిర్గతవిమల గంభీర భాషణము, రసమయలోకములకు తీసికొని పోవు సరస వచన చమత్కృతి, అనన్యమైనశ్రీకృష్ణ ప్రేమ పరమాత్ముని సామీప్యమే స్వర్గముగా, జీవితపరమార్థముగా నెంచి భానునిచే ప్రకాశించు నభోమండలమువలె, కృష్ణుని చేతనే నిలచి మనుష్యరూప దేవకాంతయైనది రాధ సాహిత్యమున ఒక మధుర గాథగా మారినది

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి -

# "కపోతకథ"

- సాహిత్యకోవిద శ్రీ క్రొవ్విడి రామం, B A, B L, B Ed

ఆంధ్ర పరిశోధకులలో అగ్రతాంబూలాన్ని అందుకున్న మహామహులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వీరిచేతి చలువవల్లనే, తిరుపతిలోగల తాళ్ళపాక వారి సాహిత్యం వెలుగులోకి వచ్చింది చాలాకాలంకిందట వీరుభారతిలో ప్రచురించిన 'బసవోదాహరణ' ఉదాహరణ వాఙ్మయానికి శ్రీకారం చుట్టింది వీరి చాటు పద్యమణి మంజరి తెలుగువారి చాటుధారల రామణీయకతను సవ్యాలక ప్రదర్శించింది

1925 వ సంవత్సరంలో శ్రీ ముక్త్యాల సంస్థానాధీశ్వరులైన వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దర్ వారు బ్రహ్మవంకోత్సవాలు జరపించి విద్వత్కవులను సన్మానించేరు శ్రీవారి ఆదేశానుసారం కొందరు కపోతోపాఖ్యానాన్ని వ్రాస్తున్నారు వీరికి కూడా అటువంటిరచన చేయాలని ఆసక్తి కలిగి మూడుపూటలలో 'కపోతకథ' అనే యీలఘుకృతినిపూర్తి చేసేరు 'కొందరగా రచించుటయే, పరమార్థముగా జూచుటకొనుటచే, నిందు కవితాగౌరవము కానరాకపోవచ్చును' అని శ్రీ శాస్త్రిగారే 'తొలిపలుకులో' ఉటంకించేరు కాని విద్వత్కవులైన వీరి రచన చాలా సహృదయ హృదయాహ్లాదకరంగా వుందని, యీకృతి పరిశీలించిన ప్రతిసాహిత్యపిపాసువునకు తెలుస్తుంది

భారతంలో శాంతిపర్వంలో, అంపశయ్యపై వున్న భీష్ముడు ధర్మరాజుకు ఉపదేశించిన ధర్మసూక్ష్మాన్ని తిక్కయజ్వయెంతో మనోరంజకంగా నిరూపించేడు ఆసందర్భంలో వివరింపబడినదే యీకపోతోపాఖ్యానం ఆర్తరక్షణార్థం ఆత్మత్యాగంచేసే ధన్యజీవుల ఔదార్యన్ని యీగాథ కన్నులకుకట్టినట్లుగా నిరూపిస్తుంది రాతిగుండె కలవారినిసైతం సద్వర్తనగల వారినిగా మార్చేశక్తి యీ తాగానికి వుందని బుజువౌతుంది

"పుణ్యకీర్తితో సుపుత్రసుపుత్రికా
వృద్ధితోడ, నిష్టసిద్ధితోడ
పెక్కువత్సరములు చక్కగా శ్రీచంద్ర
మౌళివిభుడు రాజ్యమేలుగాక!

అనే ఆశీస్సుతో ఈ కపోతకథను, శ్రీ శాస్త్రిగారు ముక్త్యాల సంస్థానాధీశ్వరులకు ఉపాయనంగా బహూకరించేరు

గోదావరీతీరంలోవుండే ఒకమహారాజు వృత్తాంతంతో ఈ కథ ప్రారంభం అవుతుంది

'పొంగడు రాజ్యవైభవము
పొందితినంచును, పాపచింతకున్
లొంగడు, సంపదభ్యుదయ
లోలుపతన్ చెలరేగ డెన్నడున్
క్రుంగడు రాజ్యనిర్వహణరూప
భరంబును మోయుపట్టునన్
భంగ మెఱుంగనట్టి నరపాలురు
తత్సములెందు నుండరే॥'

అని వీరు ఆ నృపాలుని యొక్క గుణగణాల్ని కొనియాడేరు కాని యీధరాధినాథుడు ఆదాయాన్ని మించి ఖర్చు చేస్తాడు ఈ విధంగా

'అడిగినవారల కెల్లన్
విడబడి యీనంగ దగునె
విబుధాచలమున్
బొడవడగ బహు యాచక
విడంబనము చేత నెరుగవే మది నిదియున్'

అని ఒక ఆప్తుడు రాజుగారికి నచ్చచెబుతాడు ఆసమయంలో అనుమిహాపుడు శాంతిపర్వంలో వున్న కపోతోపాఖ్యానాన్ని అతనికి వివరిస్తాడు

క్రూరుడైన ఒకబోయవాడు అడవిలో జంతుసంహారం చేస్తూ వుండగా అకస్మికంగా పెద్దవాన పడుతుంది. గత్యంతరం లేక ఆబోయ ఒక పెద్దవటవృక్షాన్ని ఆశ్రయిస్తాడు చిరకాలంనుంచి ఆచెట్టు తొఱ్ఱలో నివసిస్తున్న కపోతమిథునంలో ఆడకపోతం బోయవానివలలో చిక్కుకుంటుంది కపోతరాజు ప్రేయసిరాకకై ఎదురుచూస్తూ పలవరిస్తూ వుంటాడు ఇక్కడ విప్రలంభశృంగారాన్ని యథార్థంగా శ్రీ శాస్త్రిగారు పోషించేరు. ప్రియుని ఆర్తవాక్యాల్ని బోనులోచిక్కుకున్న ఆడపక్షి విని, భర్తకు తనపైగల మక్కువను గ్రహించి, సంతోషిస్తుంది

ఎంతకఠిన హృదయుడైనా బోయ తనకు అతిథిగా వచ్చేడు గనక, అతన్ని సంరక్షించేనిమిత్తం మగపక్షి చేరువనున్న పల్లెకుపోయి, మండుతున్న కట్టెపుల్ల రెండవకొసను ముక్కుతో పట్టుకుని వటవృక్షం దగ్గరకుతీసుకు వస్తుంది. వానకు ఆ ప్రాంతమంతా తడిసిపోయి వుండటంచేత, తన గూటిని భేదించి ఆ కపోతరాజు ఎండుపుల్లలతో మంటచేసి బోయవానిని చలి కాచుకొమ్మంటుంది. అతని ఆకలి తీర్చడానికి ఈ కపోతం జ్వాలకు ఆహుతైపోతుంది త్యాగధనుడైన కపోతరాజుచర్య బోయలో బ్రహ్మాండమైన పరివర్తనాన్ని కలిగిస్తుంది అంతవరకు బంధించిన పక్షుల్ని విడిచిపెట్టి అతనుకూడా అగ్నిదేవునకు తనశరీరాన్ని సమర్పిస్తాడు కపోతరాజు సతీమణి వల నుంచి బయటకువచ్చిన తత్క్షణమే సహగమనం చేస్తుంది వీరి ముగ్గురినీ దేవతా విమానం పరలోకానికి తీసుకుపోతుంది

'ఉరులిటు మాట్లు పెట్టి వల
లొగ్గెను డేగల నాం ౦బునన్
బరపెను, కుక్క జట్టు పసి
పట్టగ విడ్చెను బెక్కు యత్నముల్'

మొదలైన చరణాలలో వ్యాధుని కార్యాచరణ విధానం కన్నులకు కట్టినట్లుగా నిరూపితమైంది 'స్వభావోక్తి' అలంకారానికి యిలాంటి పద్యాలు చక్కని ఉదాహరణలు-

'భూమిభాగము జలప్లుత మయ్యె నభ మెల్ల
గాఢాంధకారమ్ము క్రమ్ముకొనియె
అంతరిక్షము, భూమిసంతతిం చెడుమాడ్కి
సంతతధారగా సాగె వృష్టి'

మొదలైన చరణాలు నాటి తుపాను భీభత్సాన్ని ఎరుకపరుస్తాయి.

ఇదివరకే మనవిచేసినట్టుగా కపోతరాజుభార్యకై విలపించే ఘట్టంలో మానవ హృదంలోవుండే భావాలన్నీ యీకవిగారు ఆపిట్టగుండెల్లోకి జొప్పించేరు-

'అదరుచుండె గుండె నిదురయు రాదయ్యె
నింపుమాలెనాదు కొంపకూలె'

వంటి చరణాలు కరుణరస ప్లావితాలుగా వున్నాయి

' బోయడా! నా యెడల్
గైకొమ్మ్యాకలి మంటలారుటకునై
నీచమా
నీకాయమ్మతిథిక్షుధార్తినుడుపన్ వేల్తున్
జ్వలద్వహ్నిలో
నీకిద్దాన నొకింత తృప్తియగు నేన్, నే
ధన్యతన్ గాంచెదన్'

అనే చరణాలు కపోతరాజుయొక్క ధీరోదాత్త లక్షణాన్ని తెలియజేస్తాయి.

చవిగల పలుకుబడిని చదువరులకు రుచి చూపించడానికా అన్నట్టు శ్రీ శాస్త్రిగారు కొన్నితమాషా అయిన పదప్రయోగాలు చేసేరు

'నీతు లు పల్కువారిల, న
నేకులు, కోతురు, వారి చేతలా
రీతుల జక్కగా ననుస
రించుట లోపదు, మేలు గల్గదా
కోతలమార్లచే నొరుల
కున్, వగ దాము వచించు ధర్మముల్
చేతల నిల్వరింతురు వి
శిష్టులు, వారుగదా జగద్గురుల్'

అనేపద్యం తీసుకుందాం. కొందరు గ్రాంథిక భాషాభిమానులు 'కోతురు' అనే పదంయొక్క సాధుత్వాన్ని ఒప్పుకోక పోయినా, చేతురు 'కోతురు' మొదలైనవి బహుళ కవిప్రయోగాలలో వున్నాయని గిడుగవారు ఏనాడో ఢంకామీద దెబ్బవేసి చాటేరు- ఇది యిలావుండగా 'కోత' అనేశబ్దం డాంబిక ప్రవచనం అనే అర్థంలో నేటి వ్యవహారంలో చెలామణీ అవుతున్నది ఆ అర్థంలోనే కవిగారు 'కోతలమార్లు' అంటే కోతలరాయళ్ళు అనే అర్థంస్ఫురించే విధంగా ప్రయోగించి నేటిపలుకుబడితీరును ప్రదర్శించేరు-

ఇది కేవలం నీతిబోధకమైన ఉపాఖ్యానమే అయినా, శ్రీశాస్త్రిగారి చేతిలో యీలఘుకృతి ఒకరసమధురమైన రమణీయకావ్యంగా రూపొందింది- ఈకపోతకథ మద్రాసు ఆంధ్రపత్రికాప్రెస్సులో ఆరోజుల్లో అచ్చు అయింది

# కవికర్ణరసాయనం - కవిజనరంజనం

## ( తులనాత్మక పరిశీలనము )

- శ్రీ జూలూరి వెంకటేశ్వరరావు, ఎం ఏ

సంకుసాల నరసింహకవి రచించిన విలక్షణ నామ విలసిత మృదు మధుర కావ్యము కవికర్ణ రసాయనము తన కావ్యము నందలి శృంగార వర్ణనలు వినిన యతి విటుడు కాకపోడనియు వైరాగ్య వర్ణనలు వినిన విటుడు యతి కాకపోడనియు, ఆత్మ ప్రత్యయముతో నరసింహకవి ఈ రసవత్కావ్యమును రచించెను సత్కవుల కర్ణములకు రసాయనము కావలె నను ఆశయముతో దీనికి కవికర్ణరసాయన మని పేరిడెను ఆకాలమున కిది విలక్షణము, నవీనము పెద్దన మనుచరిత్రకంటెను ఈ కావ్యము ఉత్తమమైన దని కొందరి పొగడ్తలకు నోచుకొనినది.

కవికర్ణరసాయన ప్రభావముతో వెలువడిన కావ్యములలో కనుపర్తి అబ్బయామాత్యుని కవిరాజ మనోరంజనము, అడిదము సూరకవి రచించిన కవిజన రంజనము, కూచిమంచి తిమ్మకవి కృత రసికజనమనోభిరామము ప్రముఖములుగా కన్పట్టుచున్నవి ఈ కావ్యములందు కవిజనరంజనము మేల్తర మనుట నిశ్చయము. 'శృంగారనైషధ వసుచరిత్రాది మహాకావ్యములతర్వాత ఆధునికాంధ్ర వాఙ్మయములో నంతటి యున్నతస్థాన మలంకరింపదగిన దీ కవిజనరంజనమే' యని నుతికెక్కినది

మాంధాతృ చరిత్రము కవికర్ణ రసాయనముగా రూపు దిద్దుకొనగా, హరిశ్చంద్ర వివాహవృత్తాంతము కవిజనరంజనముగా అవతరించినది ఒక కావ్యము కవికర్ణములకు రసాయనముకాగా వేరొకటి కవిజనులను రంజింపజేయునది. తన ప్రతిజ్ఞమేరకు నరసింహకవి విస్తృతముగ శృంగార వర్ణన చేయగా, తత్ప్రభావమున రచించుటచే సూరకవియు శృంగార వర్ణన విస్తారముగనే చేసెను

కవికర్ణరసాయనము ఆరాశ్వాసముల కావ్యము కావ్యములోని చివరి రెండాశ్వాసములు వైరాగ్యవర్ణనలకు సంబంధించినవి ద్వితీయాశ్వాసము రాజనీతి వివరణ, మాంధాతృ విజయములకు సంబంధించినది మిగిలినవానిలో ప్రథమాశ్వాసము మాంధాత జన్మాదికమునకు తృతీయ చతుర్థాశ్వాసములు శృంగార జీవితమునకు పరిమితములు. ఈ మూడాశ్వాసములను మాత్రము ప్రధానముగ గ్రహించి సూరకవి తన కవిజనరంజనమును మూడాశ్వాసములలో తీర్చిదిద్దెను కవికర్ణరసాయనము నందలి భావశబలత, వర్ణనావైశారద్యము కవిజనరంజనమున కానరావు ప్రౌఢతయందును కవికర్ణరసాయనమే అగ్రాసనాధిపత్యము వహించును అయినను కవికర్ణరసాయన కావ్యకన్య

మనోగతం దెరింగి వర్తించు ప్రియసఖి యుంబోలె కవిజనరంజన మలరారు చున్నది

యువనాశ్వ పుత్రుడగు మాంధాత అయోధ్యా పురిమునకు రాజయ్యెను. ఇద్దరు చిత్రకారులు వచ్చి కుంతలాధీశ్వరుని కూతురగు విమలాంగి చిత్రమును మాంధాతకు చూపుదురు. మాంధాత విమలాంగియం దత్యంతాసక్తుడయ్యెను మాంధాత చిత్రము నాచిత్రకారులు కుంతలాధీశున కిచ్చి మాంధాత గుణములను ప్రస్తుతింతురు చిత్రపటమున మాంధాతను చూచిన విమలాంగి ఆతనిని మోహించును ఇరువురును విరహబాధలకు లోనగుదురు కుంతలాధీశ్వరుడు దూతను పంపగా మాంధాతృ నృపోత్తముడు తరలి వచ్చి విమలాంగిని వివాహమాడును. వివాహానంతరము అయోధ్యకు తిరిగివచ్చి శృంగారసుఖము లనుభవించుట కవికర్ణ రసాయన కథా కథనము



అయోధ్యాపురమును హరిశ్చంద్రుడు పాలించుచుండెను విజయాస్పదపురము నేలు ఉశీనరపతికుమార్తె చంద్రమతి. హరిశ్చంద్రుని రూపమును, చిత్రకారుల వలన చూచియు, తచ్చరితంబును వినియు, ఆతడే తనకు తగిన విభుడని చంద్రమతి వలచెను చిత్రకారులవలన చూచియు, ఆమె సౌశీల్యమును వినియు చంద్రమతియే తనకు తగినవెలది యని హరిశ్చంద్రుడు తలచెను ఇరువురును విరహావ్యథ ననుభవింతురు, ఉశీనరుడు దూతను పంపగా హరిశ్చంద్ర చక్రవర్తి తరలివచ్చి చంద్రమతిని వివాహమాడును వివాహానంతరము అయోధ్యకు తిరిగివచ్చి మన్మథ సామ్రాజ్యమున తేలియాడుట కవిజనరంజన కథాప్రకారము

కవి కర్ణ రసాయనము అయోధ్యా (సాకేత) పురవర్ణనతో ప్రారంభమగును. కోట, పరిఖ, కనకహర్మ్యములు, గజాశ్వములు, బ్రాహ్మణ క్షత్రియాదులు, క్రీడాగృహములు, కర్పూరాగరు ధూప ధూమ పటలములు, వారసతులు, పూదోటలు, సరసులు, కోడెగాడ్పులతో ఇరువది నాలుగు పద్యములలో పురవర్ణనసాగినది అందలి ఆరామవర్ణనము —

అజహచ్చంద్ర విజృంభముల్, శుకపికా
ద్యారూఢ నానావిధ
ద్విజమృష్టాన్న యథేష్టసత్ర గృహముల్
దివ్యన్మదోత్సేక భా
వజ సర్వస్వము, నంచితానిల నిజ
స్వారాజ్యముల్, దంపతీ
వ్రజతారుణ్య సమృద్ధి సాక్షులు పురో
పాంతస్థితారామముల్ (1-23)

కవిజనరంజనము కూడ అయోధ్యాపుర వర్ణనముతోనే ప్రారంభమగుచున్నది. బహుశః కవియును అయోధ్యాపురమే యగుటచేతనేమో కవికర్ణరసాయన పురవర్ణనములోని అంశములన్నియు నిందు చోటుచేసుకొనినవి ఇందలి పూదోట వర్ణనము —

వలపుల పాఠిండ్లమములు
మలయానిలముల విహారమందిరములు పూ
విలుతుని యాయుధశాలలు
చలువల జన్మస్థలము లచటి పూదోటల్
(1-14)

నవయౌవనవతియైన విమలాంగి సౌందర్యమును నరసింహకవి నఖశిఖ పర్యంతముగ వర్ణించెను సకలావయవ సౌందర్యమును విడివిడిగా వర్ణించియు తనివితీరకయో లేక ఆమె సౌందర్యాతిశయమును పరిశ్రృహృదయములలో మరింత ప్రస్ఫుటముగ ముద్రించుటకో సకలావయవ సౌందర్యమును సమష్టిగా మరికొన్ని పద్యములందు వర్ణించెను విమలాంగి సౌందర్యము —

కన్నులఁ జంచలత్వమును
క్రౌర్యమపాంగ విలోకనంబులన్
జన్నులఁ గర్కశత్వము, కృ
శత్వముఁగౌనున, మంద భావమున్
నెన్నడ, వక్రతం గురుల
నెక్కొనఁజేసియు నెట్టిచిత్రమో
కన్నియ జవ్వనంబు త్రిజ
గజ్జన సన్నుతమయ్యె నయ్యెడన్
(3-20)

దూష్యములైన చంచలత్వము, క్రౌర్యము, కర్కశత్వము, మందభావము, కృశత్వము, వక్రత ఆమె కన్నులను, చూపులను, చన్నులను, నడుమును, నడకలను, కురులను చేరియున్నను విమలాంగి సౌందర్యము ముల్లోకములందును సన్నుతికెక్కినది

కవిరంజనము గావించు చంద్రమతి సౌందర్యము కూడ విమలాంగి సౌందర్యము వలెనే సన్నుతికెక్కినది

'కన్నుల చంచలత్వమును,
గబ్బిచనుంగవ కర్కశత్వమున్
నెన్నడ మాంద్యముం, గురుల
నెక్కొను వక్రత, కౌను కార్శ్యము
న్నన్నుతికెక్కె నా నచల
సంపద బోటి కటిం ధరించుటన్

స్వప్నియ కెక్కవే యువతు
ణ బులు మిక్కిలి కల్మియున్నదన్
(1-62)

అవగుణంబులతోఁ గూడిన విమలాంగి సౌందర్యము త్రిజగజ్జన సన్నుతమగుట ఎట్టి చిత్రమో యని నరసింహకవి అబ్బురపడగా కలిమి సరసనే అవగుణంబు లుండుటవలన చంద్రమతి సౌందర్యము సన్నుతికెక్కవదని సూరకవి సమర్థించెను.

విరహావ్యథ ననుభవించు విమలాంగి మదన చంద్రానిలాద్యుపాలంభనము గావించినది మన్మథు నిట్లు దూషించినది —

తలప దోషాకరుండే తగిన ప్రాపు
సహచరుడు జాతిమాలిన చైత్రుడట్టె
యెప్పుడును నీవు నీయొడ లెఱుఁగ, వింక
మదన, మఱియేమి చెప్ప నీమధుపగణము'
(3-127)

దోషములకు నిలయమైనవాడు ఆశ్రయదాత, సహచరుడు జాతిలేనివాడు, నీవు ఒడలెఱుగనివాడవు నీ త్రాగుబోతు గుణమునేమి చెప్పవలెనని యొక అర్థము. చంద్రుడు దోషాకరుడగుట, చైత్రమున జాజిపూయక పోవుట, శరీరము భస్మమగుటచే ఒడలెఱుఁగక పోవుట తుమ్మెదవింటి నారియగుటచేత మన్మథుని మధుపగుణము విదితమే. ఇక తన్నల్లరిపెట్టు శుకపికముల నిట్లు నిందించినది —

'కర మర్థి నేను పెనుపం
బెరిగిన శుకమోట లేక ప్రేలుచు హృదయం
బెరియింపదొడఁగె నింకం
బరభృతములు చెప్పనేల పంకజవదనా!'
(3 103)

నాచేత పెరిగిన చిలుకయే నన్నారడిపెట్టుచుండ ఇతరులచేత (కాకులచే) పెరిగిన కోయిలల సంగతి చెప్పెడిదేమున్నదనుచున్నది

విరహవేదన ననుభవించు చంద్రమతియు మన్మథాద్యుపాలంభము గావించినపట్టుల సూరకవి పైపద్యములకు ప్రతిబింబము లనదగిన పద్యములను రచించెను అవి—

కొమ్మలనదల్చు నెప్పుడుఁ గమ్మగాలి,
విధుతనయుఁడు మనోజుఁడు, మధుడు జాతి
వైరి, దోషాకరుండుడు వల్లభుండు,
కలికి వీరికి సుగుణంబు గలుగు టెట్లు?'
(2-28)

'పరభృతంబు గానఁ బరికించి యొకవేళ,
గోకిలంబు సేయఁ గూడఁ గాక,
కాంత నామధేయ మెంతయుఁ గైకొని
చిలుక, నీకు వెట్టసేయఁదగునె?' (2-49)

ఉపాలంభనము లీవిధముగ పూర్తియైనవి

విమలాంగీ మాంధాతల వివాహము జరిగినది సఖులు విమలాంగి నలంకరించి క్రీడామందిరమునకు తెచ్చి పతిసెజ్జచేర్చి వెడలిరి మందిర మధ్యములందు ప్రతిఫలించిన తన రూపమును చూచి అన్యకాంత యని భ్రమించి తల్పము దిగిపోవు విమలాంగిని మాంధాత పట్టి నిలిపెను తల్పము పైకిలాగబోవ కాలూని నిలచినది. మాంధాత రసాతిరేకమున నామె పయ్యెద తొలగింపగా కరకమలములచే కుచములను కప్పుకొనినది కలహము తనకేల యని కాబోలు నీవి తనంత తానే జారగా కుచముల కప్పుకొనిన చేతులనుతీసి నాభి క్రిందిభాగమును కప్పుకొనెను మాంధాత ఆమె కుచమండలము నాక్రమించగా చీర జారిన సిగ్గు భరించలేక విమలాంగి పతిని బిగువుగా కౌగిలించుకొనెను.

ఒడిసి జఘనాంశుకం బపు
డెడలించిన విభునిదృష్టి కెడ యీని
బడతుక లజ్జావశమున [మతిన్
గడువడితోఁ బొదివి బిగ్గఁ గౌగిటఁ
జేర్చెన్ (3 218)

ఇట చంద్రమతీహరిశ్చంద్రుల వివాహమైనది. సఖులచే అలంకృతయై పతిసన్నిధికి కొనిరాబడిన చంద్రమతి అవస్థయు విమలాంగివలెనే అయినది

పయ్యెదఁ బాపుడు నుదతి
పాణి సరోజములం గుచద్వయం
బొయ్యన మాటఁ బోకముడి
యూడిచి చక్కిలిగింత గొల్పిరా
జయ్యెడఁ జన్నదోయి తన
కగ్గము చేసెను గ్రమ్మఱన్ భళా
ఎయ్యదిగాదు లోకువ మ
హీస్థలి సమ్యగుపాయశాలికిన్
(3-84)

తమిఁ జన్గవ దోలంగఁ జేసినఁ గుచ
ద్వంద్వంబు హస్తారవిం
దముల న్మాటుడు నీవిఁ బాపమతి యు
త్నం బేమియుం దోచకా
ప్రమదారత్నము నాథు కౌగిట ఘటిం
పన్నేల్స్వియం గ్రాహ సౌ
ఖ్యము గల్పించె నవోఢలజ్జ యనుచుం
గాంతుండు పొంగెన్మదిన్. (3-80)

తదుపరి శృంగారకేళి విస్తృతముగ వర్ణితమైనది నాయికానాయకుల కామకేళీ కలాపములు నిరూపితములైనవి విమలాంగి నేర్పరితనమును కవి ఇట్లు నిరూపించుచున్నాడు —

నెమ్మోవి దాచెడి నెపమునఁ జెక్కులు
చుంబింప నెడమిచ్చు సుదతి నేర్పుఁ,
గినిసి చెక్కులు దాచికొనియెడి నెపమున
మోము మోమునఁ గూర్చు ముదిత వెరవు,
సడలెడి తననీవి సవరించు నెపమునఁ
గౌగిటి కొదవించు కాంత తలపుఁ,
గరములఁ జనుదోయి గప్పు నెపంబున
నీవిక సందిచ్చు నెలత మతము
తొడిఁబడక, గానబడనీక, యొడలు
నులియు
నెపము మైఁ గౌగిటి కెదుర్చు నీరజాక్షి
యుపమయును భూమివల్లభు నుల్లమునకుఁ
గ్రొత్తచవిగొల్పె మఱి వేఱె కొన్ని నాళ్ళు
(3-223)

విమలాంగి నేర్పరితన మిట్లుండ చంద్రమతి నెరజాణతన మెట్లున్నదో గమనించవలయును గదా

జాఱిన నెఱికొప్పు సవరించు నెపమున
బాహామూలద్యుతుల్బయలు పఱచి
ప్రిదిలిన నీవిక బిగియించు మిషమున
గబ్బిగుబ్బ లురమ్ముగదియఁ గ్రుమ్మి

చెదరు పయ్యెదఁ జక్కఁజేర్చి
దంభంబున
నూరులపై నూరు యుంగరిఁ బెనచి
డిగజాఱు ముంగురు లెగదువ్వ కైతవం
బున నెమ్మొగంబుపై మోము జేర్చి
యంతకంతకు వెగ్గలంబగుచుఁ దనదు
భావమునఁ దోచుతమి బయల్పడకయుండ
విభుని డెందంబునకుఁ గొల్పెవింత చవులు
కువలయదళాక్షి మతియొక కొన్ని నాళ్ళు
(3-106)

నాయికా నాయకుల ప్రథమ సంగమ వర్ణనముతోడనే ఈ కవులకు తృప్తికలుగ లేదు నాయికానాయకు లటులు కొన్ని నాళ్ళు రతిసుఖంబుల తేలియాడిరి పతి చేతి రతికళాశిక్షణమున విమలాంగి —

నెచ్చెలి పిలువ రానేర దింతకుమున్న
తానయై రతులకుఁ దఱుముటెట్లు ?
చేపట్టి తివియక చేర దింతకు మున్న
పౌరుషంబున నెట్లు పైనటించెఁ ?
బయ్యెద దివనీక పట్టునింతకు మున్న
సిగ్గునే సంగతి దిగ్గనాడె ?
నడిగిన మాఱు మాటాడ దింతకుమున్న
రతికూజితంబు లేగతి రచించె ?

అబలయటె పేరు, సుకుమార మ్మటె తనువు
తరుణిరతినిర్దయత్వంబు దలచునపుడు
కొసరదట యింతయైనఁ బైకొనగ నింక
నాతిదీనోక్తు లెట్లుగా నమ్మవచ్చు ?
(4-177)

చంద్రమతియును తక్కువ తీర్చినది కాదు, రతికేళిలో నంతకంతకు గడితేరిన చంద్రమతి —

పదిపిల్పులకును దాఁ బలుకఁ గొంకెడు
కాంత
పలుమాఱు వింత గాఁ బలుక నేర్చెఁ
జేయిసాచిన నోరనిలు పయోజానన
తలుకుగుబ్బల ఱొమ్ము గ్రుమ్మ నేర్చెఁ
బ్రార్థింప మొగమెత్తి పాఱజూడనిచాన
చుఱుకు వాల్చూపులఁ జూడ నేర్చె
మోవిపంటను నొక్కఁ మోము
ద్రిప్పెడు లేమ
తియ్యనిమోవి యందివ్వ నేర్చె
రతికిఁ జాలుకగ మైకొనిరాజవదన
ప్రబల కుంభావ సంభోగ పటిమఁ దేల్చె
నసమ సాయక కేళిలో ననుదినంబు
నంతకంతకు గడితేఱె యా మిటారి
(3-107)

ఈ విధముగ రెండు కావ్యములందును శృంగారవర్ణనలు కవికర్ణరసాయనముగ, నాయికానాయకుల శృంగారజీవితము కవిరంజనములుగ కొనసాగినవి

నామకరణమునుండి, కథా కథనము ద్వారమున, వర్ణనల పర్యంతము కవికర్ణ రసాయన ప్రభావము కవిజనరంజనమునై ఎంత గానున్నదో ఈపరిశీలనమువలన తేటపడుచున్నది వివరించవలసిన అంశములు విస్తారముగనున్నను స్థలాభావ మేర్పడు నను శంకతో నింతతో విరమింపవలసి వచ్చినది



## రచయితలకు

అతి దీర్ఘములైన రచనలు బాగా ఉన్నను ప్రచురణకు అలస్యము కాగలదు తమ రచనలకు సంబంధించిన కవరుపై లేదా కవరింగు పేపరుమీదనేకాక లోతట్టు పేజీలలో రచనకు మొదటకాని, చివరగాని రచయిత పూర్తి అడ్రసు తప్పక ఈయవలయును. రచయితలు మాకు సంపూర్ణసహకార మీయగలరని ఆసించుచున్నాము.

– సంపాదకుడు.

## ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గ విస్తరణ

ఇటీవల విస్తరింపబడిన ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గ సభ్యులసంఖ్య కేంద్ర మంత్రివర్గ సంఖ్యకన్న అధికము ప్రభవాది సంవత్సర సంఖ్యకన్న అధికము మన రాష్ట్రములోని జిల్లాకలెక్టర్ల సంఖ్యకు సుమారు రెండున్నర రెట్లు

ఎలిమెంటరీ తరగతులలో ప్రభవాది సంవత్సరములు అరువది వరుసతప్పకుండ ఒప్పగింపగల మన విద్యార్థులు కొందఱు కూ మంత్రుల పేర్లు - పోర్టుఫోలియోలతో కాకపోయినా - జ్ఞాపక ముండకపోవు ఏ కొలది సంఖ్యలో అయినా మరియొక సప్లిమెంటరీ లిష్టు ఉండకపోదని భావించే ఆశావాదులూ లేకపోలేదు 'కాదేదీ కవిత కనర్హం' అన్నట్లు, మంత్రిపదవి కనర్హుడీమహిని గలడె, సాక్షరేతర శాసన సభ్యులందు' అని కూడా నేడు భావించబడుతోంది

జీతభత్యాలకోసం ఇతర వసతి సౌకర్యాదులకోసం విపరీతంగా ధన వ్యయంతోకూడిన విస్తరణ అని ఆక్షేపించే పొదుపువాదులు కొందఱు అనేక రంగాల్లో ఖర్చుగాక మిగిలిపోయే ధనాన్నిగురించీ, మంచినీటిప్రవాహంలా వృథావ్యయం అయ్యే ధనాన్ని గురించీ ఆలోచిస్తే ఇదో లెక్కా అనే సంతృప్తివాదులు కొందఱు మంత్రివర్గ సంఖ్యాధిక్యాన్నిబట్టి పనులు అవిలంబంగా సమర్థంగా జరుగతాయనే సమర్థింపుదారులు కొందఱు స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ తక్కువ సంఖ్య మంత్రివర్గాలేవీ సమర్థంగా జరగలేదా అనే విమర్శవాదులు కొందఱు ఈలా ఈ నూతనరీతి విస్తరణపై అనేకు లనేక విధాలుగా ఆలోచించడం అసహజం కాదు

సంఖ్య పెద్దదైనా చిన్నదైనా వ్యక్తుల చిత్తశుద్ధిని లక్ష్యశుద్ధిని బట్టి ఫలితం ఉంటుందనేది ఎవరూ త్రోసిపుచ్చరాని

సత్యం ఆ రెండూ ఏలా ఉంటాయో ఇపుడు ప్రమాణస్వీకారం చేసినవారిలో ఎంద రెటువంటి వారన్న దానినిబట్టి భవితవ్యం ఊహించుకోవలసి ఉంటుంది

శ్రీ చెన్నారెడ్డి మంత్రివర్గ సభ్యులలో చాలమంది అవినీతిపరులని ఆరోపించిన అసమ్మతివర్గ ప్రముఖు లందరూ ఆ అవినీతిపరులతో సహాపంక్తి సహాసనాదులతో పాలనాసంసారము ఎలా సాగించదలిచారో అన్నది ఆశ్చర్యావహం కాక తప్పదు వీరు వారిని తమసాంగత్యముతో పరిశుద్ధులను చేస్తారో లేక వారిలో లీనమైపోతారో వేచి చూడవలసి యున్నది తమ్ము అవినీతిపరులని ఆరోపించినవారితో సహజీవనయాత్రకు కోరి సిద్ధపడిన - దూషణ భూషణములను లెక్కసేయని - ఆ రెండువర్గము వారి నిర్లిప్త స్థితియు మెచ్చదగినది

క్షణంలో అవలీలగా పార్టీ పరివర్తనం పొందగలిగినట్టివారిలో సదాశయ పరివర్తనం కలగడం కూడా అసంభవం ఏమీ కాదు అద్భుతం మాత్రం కావచ్చు

నిత్యావసర వస్తువు లేవియూ ఎంతటి వ్యయప్రయాసలతోనో కాని లభ్యము కాక ఏ ప్రభుత్వ కార్యాలయంలోను ఏ చిన్న పెద్ద పనులూ అత్యధిక వ్యయ ప్రయాసలతోనే కాని జరగక నానాయాతనలు పడుచున్న ప్రజానీకానికి ఏమాత్రం మేలుజరిగినా మంత్రివర్గ బాహుళ్యంవల్ల కలిగే ధనవ్యయం దుర్వ్యయం కాజాలదు గౌ. శ్రీ అంజయ్యగారి కార్యసరళిలో ఆశావహసూచనాంకురములు కొన్ని కానవచ్చుచున్నవి అవి పుష్పించి ఫలించి పుట్టి ముఖులోమా దేవికావడండా ప్రవర్ధిల్లాలని ఆసించడం దురాశ కాదు

గౌ॥ శ్రీ అంజయ్య పర్జన్య గర్జారవములు శారదాభ్రగర్జాడంబరములు కాక వార్షిక మేఘుని నినాదములు కావలెనని ఆకాంక్షిస్తూ నిరీక్షించడమే పీడిత సామాన్య జన చాతక సహృదయుల కర్తవ్యము - సంపా.

# రాజమహేంద్రవరములో జరగిన జ్యోతిశ్శాస్త్ర సభావ్యాసముల సమీక్ష

రాజమండ్రి వేదశాస్త్ర పరిషత్ వారిచే 1980 సం॥ జనవరి 20, 21, 22 తేదీల యందు సభలు జరగిన తర్వాత వెలువడిన ఆంధ్రప్రభ, సమాచార పత్రికలను చూచిన తరువాత 1-8 1980 సమాలోచన పత్రికలో సంపాదకులు వాస్తవ కథనముక్రింద వారు వ్రాసిన ప్రకారం చూచినమీదట ఈ సమీక్షను వ్రాయుచున్నాను

1 30-1-80 వ తేదీని పంచాంగాలలో వైరుధ్యాలపరిష్కారము (ఆంధ్రప్రభ)

2 16-2 80 తీర్మానముల సరియైన పారము (సమాలోచన పత్రిక)

3 7-3-80 శుక్రవారం పంచాంగ రచనలో వైరుధ్యాలు (ఆంధ్రప్రభ)

4 16-6-80 రాజమండ్రి జ్యోతిష శాస్త్రి సభలు - పిడపర్తి సోదర సిద్ధాంతుల ఆక్షేపము

5 1-8-80 పంచాంగరచనలో వైరుధ్యాలు (సమాలోచన పత్రిక)

6 16-8-80 వాస్తవకథనము - రాజమండ్రి వేదశాస్త్రి పరిషత్ వారికి సమాధానము (సమాలోచన)

7 16 11-80 వాస్తవ కథనములో అవాస్తవములు (సమాలోచన పత్రిక)

8 1-12 80 జ్యోతిశ్శాస్త్రి సభలు పిడపర్తి సోదర సిద్ధాంతుల అధిక్షేపణ. (సమాలోచన పత్రిక)

9 1-12-80 వేదశాస్త్రి పరిషత్ వారిచే ప్రచురించబడిన సావనీరు.

వీట్లను సమగ్రముగ చూచి సంగ్రహముగా నాఅభిప్రాయమును పొందుపరుచుచున్నాను

జ్యోతిశ్శాస్త్రసభలు జరిపేతీరున ఈ రాజమండ్రిలో నిర్వహించిన సభలుజరుపబడలేదు కారణమేమన, అందరకు సమ్మతమైన అధ్యక్షుని ఎన్నిక జరుగలేదు. ఎజండాను ముందుగ పంపి వారివారి అభిప్రాయములను సేకరించి ఆ వ్రాసిన సమాధానములమీద విమర్శ జరుగలేదు ఆ వ్యాసములలో పిడపర్తి సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి ఆహ్వానము పంప లేదను విమర్శ పిడపర్తివారు చేసినట్లు కనబడ లేదు పిడపర్తివారు, శ్రీపాదవారు, అనేక రోజులనుండి జరుపుచున్న వాద ప్రతివాదములేకాని యీ వ్యాసములలో నవ్యత లేదు

రాజమండ్రి సభవారు ఇదమిత్థమని తేల్చిన విషయమేమీ లేదు వాస్తవములో కేతకరుడు జ్యోతిర్గణిత గ్రంథము తరువాత మరారీగ్రహ గణితము, కేతకీగ్రహ గణితము, మొదలగు అనేక గ్రంథములు రచించిరి, చైత్రపక్షమనండి, మరియొక పద్ధతి యనండి, ప్రస్తుతము 23 డిగ్రీల అయనాంశలు వచ్చునట్లు గ్రంథముల రచించినారు. మరియొక పద్ధతి చూపలేదు మరియు ఆ మార్గమే మంచి దని అనేక-మంది సుప్రసిద్ధగణకులు గ్రహించియున్నారు

రాజమండ్రి వేదశాస్త్ర పరిషత్తు వారిచే ప్రచురించబడిన జ్యోతిశ్శాస్త్ర సభలు అను పుస్తకములో 19వ పేజీలో శ్రీ డాక్టరు మురారీలాల్ శర్మ గారి 'నిర్ణయః' అను వ్యాసములో ఇట్లు గలదు.

'తత్ర శ్రీమద్భిః పండిత మధురకృష్ణ శాస్త్రి వర్యైః స్వనిబంధే అయనాంశానాం సాధనాయ కశ్చిత్ పాండిత్యపూర్ణః విధిః వర్ణితః' తథాపి తత్ర వివాదాస్పద నిరయణ వర్ష స్వీకారాత్ తత్ర సూర్య సిద్ధాంత ప్రతిపాదిత సిద్ధాంతాత్ కల్పిత నిరయణ వర్షాచ్చాలనదానాత్ తస్య ప్రక్రియా న శుద్ధరూపేణ శాస్త్ర సమ్మతా' అతః అగ్రాహ్య తత్ర చ కరణాగతో రవి రపి స్ఫుట ఏవ గ్రాహ్యః' అని కలదు.

ఇది రామచంద్రపురమ్ సభా తీర్మానముతో ఏకీభవించు చున్నట్లు స్పష్టము. ఇక పిడపర్తి సోదరులు 'మృగక్షాంభసి స్నాతః' అని చూపిన శ్లోకమును అనాచిత్యముగా పరిగణింపవలసిన ఆవశ్యకత లేదు

'మేచకమాసే చణకం మిథ్యాదృష్టాం తమధ్య భాగం తే। మాత స్తవ స్వరూపం మంగల సంగీత సౌరభం వందే' అని పూర్వ కవులు ఉదాహరించిన క్రమముననే వీరిదియు ఉన్నట్లు స్పష్టము

కావున పరిషత్తువారు సూచించినట్లు ఢిల్లీలో జరుగబోవు సభయందు నిర్ణయమేమి జరుగునో ఆకాంక్షించెదము గాక.

ఇట్లు విధేయుడు,
ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్య
సోమయాజులు,
దువ్వ, తణుకు తాలూకా,
పశ్చిమ గోదావరి జిల్లా

# గౌడీయ వైష్ణవమతం - దర్శనం

- శ్రీ శివకుమార్.

పూర్వ చరిత్ర

భారతదేశంలో అనేకమతాలు పుట్టి, పెరిగి, నశించాయి కర్మకాండ ఆధార భూతమైన వేదమతం ప్రాచీనకాలంలో నిరాడంబరంగా వుండేది గార్హపత్యం గాయత్రీ మంత్రం వివాహితుడే గార్హపత్యార్హుడు ఈనిరాడంబరత అనతికాలంలోనే తొలగిపోయింది యజ్ఞయాగాలు ప్రవేశించాయి వీటిఫలం ఉన్నత లోకప్రాప్తి వేదమతం అంటే వేదమంత్రాలను ఉచ్చరించడమే నని నేటి వారి నమ్మకం కాని పూర్వ మీమాంసకుల ప్రకారం వేదాలు యజ్ఞాలకు సంబంధించినవే వేదాలను మంత్ర బ్రాహ్మణాలుగా విభజించారు బ్రాహ్మణాలు యజ్ఞవిధులకు సంబంధించి వి మంత్రాలు సంహితల్లో వున్నాయి ఋగ్వేదశ్లోకాలు కూర్చే నాటికే యజ్ఞాలు నిర్వహిస్తూవుండాలి ముండకోపనిషత్తులో బ్రహ్మజ్ఞాని అంటాడు

విద్యలు రెండు పర, అపర ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం, శిక్ష, కల్ప, వ్యాకరణ, జ్యోతిష, చ్ఛందస్సులు అపరావిద్యలు అక్షరం ఉన్నతమైనది యజ్ఞాలు పద్దెనిమిది మంది నిర్మించిన ఓటిపడవలు వృద్ధాప్యం మరణం కారణంగా బుద్ధిహీనులు వీటినే పరమ సత్యంగా భావిస్తారు. కఠ బృహదారణ్యక, ఛాందోగ్యోపనిషత్తులు వేద యజ్ఞాలను నిరసించినట్టు కనిపిస్తున్నా, ఉపనిషత్తులు వేదాలను ప్రామాణికంగా గుర్తించాయి వాటి ప్రకటనలకు ఊతగా వేదమంత్రాలను పేర్కొన్నాయి అంతే కాక బ్రహ్మవిద్యకు శ్రోత్రియుడు (వేదం పఠించినవాడు) అర్హుడన్నాయి అంటే వేదపరనం యజ్ఞనిర్వహణాలు బ్రహ్మజ్ఞానానికి సోపానాలుగా భావించినట్టు గోచరిస్తుంది మొత్తంమీద ఉపనిషత్తులు వేదాలను గాని, యజ్ఞాలను గాని, దూషించలేదు వదలనూలేదు ఉపనిషత్తులు మతగ్రంథాలు కావు ఒకక్రమబద్ధమైన తత్వం కనిపించదు వైదికకర్మకాండను ప్రథమంగా గీత నిరసించింది. కృష్ణుడు స్వార్థ ప్రయోజనం కోసం చేసే యజ్ఞాలను నిందించి సామాన్య శ్రేయస్సు కోసమైతే అనుమతించాడు

మహాభారత కాలంలో వేదయజ్ఞాలు వెలి అయ్యాయి పులస్త్యుడు భీష్మునితో అంటాడు 'ఓరాజా! పేదవాడు యజ్ఞాలు నిర్వహించలేడు బహుజన సేవలు, బహువస్తు సామగ్రితో కూడుకొన్నట్టివి' తీర్థాలను సేవించమన్నాడు. బ్రాహ్మణులకు దానంచేయడం, ఉపవాసం కూడా భారతంలో పేర్కొనబడ్డాయి వేదాలలోకూడా బ్రాహ్మణులకు దానంచేయడం వుంది కాని ఆదానాలు యజ్ఞకాలంలోమాత్రమే ఇతిహాస కాలపుదానాలు వేరు మహాభారతంలో చెప్పిన తీర్థాలు ఉపవాసాలు, దానాలు, అవైదికాలు అవి ఆర్థికపరిమాణామాలు సమాజంలోని ధనిక పేదవర్గాలవిభజన వలన వచ్చినవి ఈకాలంలో బ్రాహ్మణుల దురాశాఫలితంగా యజ్ఞాలకు అమిత వ్యయం కావడంచేత పేదవాడికి సాధ్యం

కాకుండా పోయింది ధనికుడుకూడా రాజసూయాశ్వమేధయాగాలు చేయలేకపోయాడు

## వేదానంతర మతాలు

ఈస్థితిని గీత తెలుపుతుంది గీతమీద శంకరుడు (9వ శతాబ్దం) భాష్యం రాసే వరకూ దాన్ని గుర్తించడం గాని, సరిగా అర్థంచేసుకోడం గాని, జరగలేదు. ఈ కాలానికిబౌద్ధం వచ్చింది బౌద్ధంహిందూ మతంలోనే కలిసిపోయిం దని ఫణిక్కర్ రెండూ భిన్నంకావని ఆనంద కుమారస్వామి తాత్వికంగా ఒకటే అయినా, మతరీత్యా భేదా లున్నాయి వైదిక కర్మకాండను అంగీకరించ లేదు బౌద్ధం. మీమాంసకులు వేదయజ్ఞాలను పునరుద్ధరించడానికి ప్రయత్నించారు. బుద్ధుని తరవాత ఒకశతాబ్దానికి జైమిని వర్ధిల్లాడు. శబరుడు 3వ శతాబ్దంలోను ప్రభాకరుడు, కుమారిలుడు కొన్ని శతాబ్దాలఅనంతరం వచ్చారు పూర్వమీమాంస వేదయజ్ఞాలను పునరుద్ధరించ లేకపోయింది ప్రభాకర కుమారిలు లిద్దరూ బౌద్ధానికి ఎదురునిలిచి, విజయసాధించలేకపోయారు శంకరాచార్యుడు (788-820) బౌద్ధాన్ని దెబ్బతీశాడు శంకరుని నాటికి బౌద్ధం క్షీణదశలో వుండటం వలన సులువయింది. బుద్ధుని ఉపదేశం ప్రపంచమంతటా వ్యాపించింది బౌద్ధాన్ని విశ్వమతంగా రూపొందించే ప్రయత్నం జరిగింది మహాయానబౌద్ధం బుద్ధవిగ్రహాన్ని ప్రవేశపెట్టి, జనుల మతంగా రూపొందింది పూజాది కర్మకాండలు ప్రవేశపెట్టడంతో వేదమతంలాగ బౌద్ధమూ క్షీణించింది నిగూఢ పూజాది కర్మకాండ, భయంకరమైన, పరమఅసహ్యకరమైన, గ్రంథాలూ వెలువడ్డాయి అటువంటిగ్రంథాలు మతంపేరిట మున్నన్నడూ వెలువడివుండలే దంటాడు వివేకానందుడు శంకరుడు పంచాయతన పూజను ప్రవేశపెట్టాడు. విష్ణు, సూర్య, శివ గణేశ, దేవీ (శక్తి) పూజలు, 3 సెప్టెంబరు 1714 లో జోధ్‌పూర్ మహారాజు అజితసింహుడు హరి, అంబ, శివ, సూర్య వినాయకుల పంచాయతనపూజను పేర్కొన్నాడు ఇష్టదైవాన్ని మధ్యలో పెట్టి నాలుగుదిక్కులా నలుగుర్ని ఉంచి పూజించడం తరువాత విష్ణు శివ, శక్తుల పదదైవపూజలు బయలుదేరాయి విష్ణువు గురించి పరిశీలిద్దాం

పురాణకాలంనుంచి మతపూజల్లో మార్పువచ్చింది ముఖ్యమైన పురాణాలు క్రీ శ 4వ శతాబ్దం నుంచి 6వ శతాబ్దం వరకు రాయబడ్డాయి వేదకాలపు ఇంద్రుడు వరుణుడు వెనక్కు వెళ్ళారు. దేవీ గణేశదేవుళ్ళు ముందుకొచ్చారు వేదయజ్ఞాలు ఆగిపోయాయి పౌరాణిక మంత్రాలు ప్రచారంలో కొచ్చాయి పౌరాణిక గాథలు బౌద్ధజాతక కథల్లాగే ప్రజలను ప్రబోధించాయి 7వశతాబ్దంలో బుద్ధుణ్ణి విష్ణువు అవతారంగా చేర్చుకున్నారు

## భక్తి

పౌరాణికమతంలో ప్రధానమయింది భక్తి భక్తిఅంటేవిశ్వాసం ఋగ్వేదంలో ఇంద్ర వరుణ దేవులస్తుతి శ్లోకాల్లో భక్తి కనిపిస్తుంది వేదఋషుల్లో సఖ్యభక్తి కనిపిస్తుంది భక్తిద్వారా అంతిమసత్యాన్ని పొందడం బీజరూపంలో గోచరిస్తుంది ఉపనిషత్తుల్లో శ్వేతాశ్వర ఉపనిషత్తులో 'అహం శరణం ప్రపద్యే' అన్న వాక్యమే రామానుజుని ప్రపత్తివాదానికి మూలం. భక్తిని ఒకసిద్ధాంతంగా ప్రబోధించింది ప్రథమంగా గీత తరువాత,విష్ణు భాగవతపురాణాలు విష్ణుపురాణం (300-500) మధ్యకాలంలో రచించబడింది వాచస్పతి (క్రీ శ 841) తన యోగభాష్యంలో విష్ణుపురాణాన్ని పేర్కొనడాన్నిబట్టి 9వ శతాబ్దంనాటికి విష్ణుపురాణం ప్రామాణికంగా గుర్తించబడింది. రామానుజుడు (1017-1137) విష్ణుపురాణాన్ని ప్రామాణిక గ్రంథంగా గుర్తించాడు భాగవతాన్ని చేర్చలేదు. మధ్వుని (13వ శతాబ్దం) కాలానికి భాగవతం వ్యాప్తిలోకి వచ్చింది భాగవతంలోని రసపంచాధ్యాయాన్ని వదిలేశాడు మధ్వుడు శ్రీచైతన్యునితో భాగవతానికి ఉన్నతస్థానం లభించింది వల్లభుడు (1479-1531) భాగవతాన్నే ప్రామాణికంగా తీసుకున్నాడు

వైష్ణవ ఆచార్యులు వేదాంతాన్ని వ్యాఖ్యానించే టప్పుడు వైష్ణవ పురాణాల్ని ఆధారం చేసుకున్నారుగాని శంకరుణ్ణి తీసుకోలేదు శంకరుడు స్త్రీలకు శూద్రులకు బ్రహ్మవిద్య తెలుసుకునే హక్కు లేదన్నాడు. సాంఘిక విషయాల్లో శంకరుడు మనువును అనుసరించాడు పురాణకర్తలెవ్వరో తెలియదు. శూద్రులకోసం స్త్రీలకోసం మత సాహిత్యాన్ని సృష్టించే వుద్దేశంతో పురాణాలు రచించబడి వుండాలి. బౌద్ధం

స్త్రీలకు శూద్రులకు బ్రహ్మవిద్య బోధించుటకు అనుమతించింది కుమారిలుడు, శంకరుడు, వ్యతిరేకించారు సనాతన ధర్మపునరుద్ధరణకు పురాణాలు చాలా తోహదం కలుగచేశాయి పురాణమంత్రాలు అందరూ పఠించే అవకాశం కలిగింది బౌద్ధం క్షీణించాక ఈఅవకాశమూ పోయింది కమలాకరుని 'నిర్ణయసింధు' (1612 గ్రంథంలో బ్రాహ్మణులు చదవగా శూద్రులు వినవచ్చునని వుంది పఠించటాన్ని ఒప్పుకోలేరు నరసింహ పురాణం డిటో ముక్తి మార్గాన్ని సులభం చేశారు మూలమంత్రమే ముక్తిమార్గం ఓంనమః నారాయణేతి మూలమంత్ర ఉదాహృతః అని మత్స్యపురాణం వేద సారం ప్రణవమే అని చైతన్యుడు వైష్ణవ భక్తి ఉద్యమం ఫలితంగా సాంఘిక ప్రయోజనం ఏమిటి? సమాజంలోని బలహీనవర్గాల స్థితిని మెరుగుపరచగలిగిందా? ముఖ్యంగా శూద్రుల స్త్రీలవిషయంలో? మతమూ, సమాజమూ, రెండూ భిన్న సత్తా కలిగినవి సమాజంలోకన్నా మతంలోనే సడలింపు ధోరణి సహనం కనిపిస్తాయి బుద్ధునినుంచి చైతన్యునివరకు అందరూ మతపునర్నిర్మాణంకోసం కృషి చేశారు సమాజాన్ని సంస్కరించలేకపోయారు! హిందూసమాజంలో కులవ్యవస్థ బలమైనది వైష్ణవాచార్యులు కుల విషయంలో జోక్యం చేసుకోలేదు గొప్ప వైష్ణవాచార్య పంచకం రామానుజ, నింబార్క, మాధ్వ, వల్లభ, చైతన్యులు బ్రాహ్మణులే

చైతన్యుడు కుల అసమానతలను తొలగించలేదు మతవిషయంలో కొంతవరకు గాడీయవైష్ణవంలో బ్రాహ్మణేతరగురువులు బ్రాహ్మణులకు దీక్షనిచ్చారు అట్టి వారిలో నరహరిసర్కార్, వైద్యుడు నరోత్తమదాసు కాయస్థుడు శ్యామానందుడు సద్గోపుడు (బ్రాహ్మణేతరుడు) తయారుచేసినవంటను ఒక్కసారి భుజింనాడట చైతన్యుడు కులనిబంధనలు చైతన్యుని అనుచరులెవ్వరూ ఉల్లంఘించలేరు. వర్ణాంతరవివాహం సహపంక్తి భోజనం ఈరెండూ బద్ధ వ్యతిరేకాలు చైతన్యుని సంకీర్తనం ప్రజలను బాగా ఆకర్షించింది కులంలేని వైష్ణవులందరూ ఒక కులంగా ఏర్పడ్డారంటే ఆదిచైతన్యుని పిలుపులో వున్న ఆకర్షణ శక్తి రామానుజుని గురువు మహాపూర్ణుడు శూద్రుడు తుకారాం శూద్రా శూద్రుడే అస్సాంకుచెందిన శంకర దేవుడు, అతని శిష్యుడు మాధవ దేవుడు కాయస్థులు తులసీదాసు తిరుగుబాటు (రియాక్షనరీ), దారుగా కనిపించినా కులవిషయంలో బ్రాహ్మణులకే ఆధ్యాత్మికాధికారం యిచ్చాడు తులసీ విచారానికి కారణం బ్రాహ్మణులు కొందరు శూద్రగురువులను సేవించడమే రవిదాస్ చెప్పులు కుట్టువాడు జాట్ కులస్థుడు ధర్నా మంగలివాడు సేనుడు ఇంకా తక్కువ కులస్థులు గురువులు కావడం 11వ శతాబ్దంలో రామానుజునితో ఆరంభమయిన వైష్ణవభక్తి వుద్యమాన్ని 500 యేళ్ళ అనంతరం చైతన్యుడు వ్యాపి చేశాడు ఆరోజుల్లో సమాజమూ మతమూ కలసివున్నాయి నిత్యానంద అద్వైతాచార్య కుటుంబాలు గౌడీయవైష్ణవాన్ని పోషించాయి భాగవతపారాయణం ఒక నిత్యజీవితభాగమైపోయింది

## విష్ణుపూజ

విష్ణుపదం ఋగ్వేదంలోను, వేదసాహిత్యంలో చాలాచోట్లను కనబడుతుంది ఋగ్వేదంలో విష్ణువు వైష్ణవులదేవుడని జీవగోస్వామి తైత్తరీయారణ్యకాన్ని బట్టి విష్ణువు నారాయణుడు, వాసుదేవుడూ, ఒకరే బౌద్ధాయన ధర్మశాస్త్రం (600 నుండి 300 క్రీ పూ ) ప్రకారం నారాయణుడే విష్ణువు విగ్రహారాధనకుమూలం వెదకడం కష్టం ఋగ్వేదంలో దైవ విగ్రహ రూపాలున్నాయి. యాస్కాచార్యుడు (క్రీ పూ 800 నుండి 500 వరకు) రాసిన నిరుక్తంలో వైదికదైవ రూపాలనుగూర్చి మూడు అభిప్రాయాలు పొందుపరచబడ్డాయి 1 దేవుళ్ళకు మానవరూపం 2 రూపంలేకపోవడం 3 రెండూ ఉండటం రూపంలే. పోయినా కొన్నికార్యాలు నెరవేర్చడానికి రూపాలు ధరించవచ్చు ఈచివరి అభిప్రాయమే అవతార సిద్ధాంతానికి మూలం పాణిని కాలానికి విగ్రహారాధన వ్యాప్తిలో వుంది యాస్కుని అనంతరం బహుశః క్రీ పూ 500 నుండి 300 కాలంలో పాణిని వర్ధిల్లాడని చెప్పవచ్చు పతంజలికాలంలో (క్రీ పూ 150-100) దైవవిగ్రహాలు పూజకు వినియోగిస్తున్నారు మూడవ శతాబ్దికి వాసుదేవపూజ వ్యాప్తిలో వుంది మనువు విగ్రహాన్ని గాని దైవనామం గాని ప్రస్తావించలేదు ఆలయధ్వజాన్ని గాని, విగ్రహాన్ని గాని ధ్వంసంచేస్తే 500 పణాలు అపరాధం విధించాడు రామాయణంలోగాని భారతంలోని, రాజు ఆలయప్రతిష్ఠ గావించినట్టులేదు గీతలో నాలుగుచేతులు గల విష్ణురూపం కనిపిస్తుంది వరాహమిహిరుని బృహత్సంహితలో ఎనిమిది లేక నాలుగు లేక రెండు చేతులు, రొమ్ము మీద శ్రీవత్సముద్ర కౌస్తుభం పసుపు రంగు వస్త్రాలు వగైరా మత్స్య అగ్ని విష్ణుధర్మోత్తర - ఇంకా యితర పురాణాల్లో విష్ణురూప వర్ణనలు విపులం సాలగ్రామపూజ ప్రాచీనమై శంకరుడు బ్రహ్మసూత్ర భాష్యంలో చేర్చిననాటి నుంచి వుంది

( సశేషం )

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు ముగా నున్నది వెల రు 20 లు ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిః పోష్టులో పంపగలము.

రెండవ సంపుటము వాల్యూములును కొలదిగా ఉన్నవి. వెల రు. 20 లు ఎం ఒ. వారికి పైవిధముగనే పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

మొదటి సంపుటము ప్రతులు పూర్తిగా అయిపోయినవి.

— సంపాద

అడ్రసు '—

సంపాదకుడు,' బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V. & Co , Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.